# చైనా స్త్రీలు



మూలం :

అనిల్ డి. సిల్వా

అనుసరణ :

టి. సావిత్రి

నీ-నా-పబ్లికేషన్స్
తెనాలి.

6-75

# ఉపోద్ఘాతము



సాధారణంగా, సమాజంలోని స్త్రీలస్థానం ఆసమాజంయొక్క చారిత్ర్యకాభివృద్ధి దశను ప్రతిబింబించి యుంటుంది. స్త్రీ గౌరవింపబడే రీతులద్వారాగాని, అణచబడే విధానాల ద్వారాగాని ఆమె నివసించే సమాజస్వరూపాన్ని గురించి ఎవరైనా షుమారుగా చెప్పవచ్చు. డబ్బు, లాభాలు గడించడమే పరమాశయంగా, ప్రజల కార్యకలాపాల కన్నిటికీ అదే మూలకారణమైన అత్యున్నత పారిశ్రామిక సమాజంలో, ప్రత్యేకంగా ప్రియుని కలిగియున్నదన్న కారణంచే భార్య నదిలో త్రోయబడడంలాంటి ఘటనలు కానరావు. భూస్వాములంటూ వుంటే అతనికి తన ప్రథమ ప్రణయరాత్రిని దాసోహం చేయనవసరంలేదు. అయినప్పటికీ సమానమైన పనికి పురుషకార్మికునికంటె తక్కువ కూలినే పొంద గలుగుతుంది. చాలినంత తిండి, బట్ట కొరకు తనశరీరాన్ని అమ్ముకోడానికి సిద్ధపడవలసి రావచ్చు. ఏమైనా, భూస్వామ్య, అర్ధ - భూస్వామ్య సమాజంలో వుండే తనతోటి సోదరీమణులకంటె ఆమెపరిస్థితి మేలైనటువంటిదే. సాధారణంగా అక్కడిస్త్రీలు అర్ధమానవులు,

అర్థపశువులు. సక్రమ మానవమాత్రులుగా జీవించడానికి ప్రోత్సహింపబడరు. ఎందువల్ల? మానవుని కనుగొనుటయే, వెనిస్, ఫ్లారెన్సు, జెనీవా, న్యూరెంబర్గు, తదితరపట్టణాలు, అంతర్జాతీయ వాణిజ్యం, పరిశ్రమల అభివృద్ధి ఫలితమైన ఇటాలియన్ రినైజాన్స (సంస్కృతి, కళలు అభివృద్ధి) దశలోనే జరిగినపుడు యిక భూస్వామ్యవిధానపు నిరంకుశ పరిపాలనతో అణచబడిన దేశం సహజంగా, స్త్రీగూడ మానవమాత్రురాలనీ, తనప్రభువు యజమాని అయిన పురుషునితో సమాన హోదా, విలువ స్త్రీకికూడ కలదనే జాగృతిపొందడం దుర్లభం. అలాంటి సమాజంలో పురుషుడుగూడ ఉన్నతస్థానంలో ఉన్న తనతోటి సోదరులతో సమానంగా పరిగణించబడడు.

చైనాలో మన స్త్రీలు వేలసంవత్సరాల కొలది అనుభవించిన దౌర్భాగ్యానికి మూలమిది. చైనాచరిత్ర మన స్త్రీల రక్తంతో, లొంగుబాటు తత్వంతో కాదు — చిలుకరించబడింది.

శతాబ్దాలు తరబడి మనబందిపోటు చరిత్ర చైనాప్రజల సహజస్వభావమైన స్వాతంత్ర్యేచ్ఛకు నిదర్శనమైనపుడు స్త్రీలకు గూడ యిందులో పాత్రఉంది. తమ పురుషులతోబాటు వారు కొండలకువెళ్లి "బీదలను రక్షించుటకై ధనవంతులను లూటీ చేయమనే పతాకాన్ని ప్రతిష్ఠించారు. అప్పుడప్పుడు, ముఠాలకు నాయకులుగాగూడ వారు పనిచేసిన సందర్భాలున్నాయి. అలాంటి స్త్రీ బందిపోట్లను గురించిన వింతవింత కథలుగూడ రచించబడ్డాయి. వ్యక్తులుగా కొందరు స్త్రీలు వారు తలచుకొన్న దానిని సాధించే నిమిత్తం హత్యలకుకూడ సిద్ధపడినవారున్నారు. ఇవన్నీ వారు న్యాయశాస్త్రం వారిని ముక్కలుముక్కలుగా

జేస్తుందని తెలిసేచేశారు. కొందరు స్త్రీలు తాముస్వేచ్ఛాపూర్వకంగా జీవించవచ్చుననే అభిప్రాయంతో యిండ్లనుండి పారిపోయి సన్యాసులుగా మారిపోయారు. మరికొంతమంది, పట్టుబడినట్లయితే మరణశిక్ష కాచుకొని యున్నదని తెలిసిగూడ తమ ప్రియులరాక సౌలభ్యంకొరకు తమ పెరటిగోడలను పగులగొట్టిన వారున్నారు. స్త్రీల యెడ అనేక అత్యాచారాలు జరుపబడ్డాయి. అయినా లొంగుబాటుతనం ఎన్నడూ హృదయపూర్వకంగా అంగీకరించబడలేదు. బహిఃశత్రువుయెడగూడ వారు అదేవిధంగా నిర్భీకులు, సాహసికులు. అప్పుడప్పుడు యుద్ధంలో జనరల్సు చనిపోతే వెంటనే సైన్యనాయకత్వాన్ని వహించి రక్షణకుగాని, దాడికిగాని సైన్యాలను నడిపిన జనరల్సు భార్యలు మనకు కానవస్తారు. నేటిచైనాస్త్రీలు తమ అవ్వలనుండి వారసత్వ సంబంధంగా సంక్రమించుకొన్న సాంప్రదాయాలు, స్వభావాలు యిలాంటివి. మనం ఎల్లప్పుడూ అణచబడే వున్నాం, కాని మేమెన్నడూ బానిసత్వాన్ని సమ్మతించలేదు.

గత 25 సంవత్సరాల చైనాస్త్రీల పోరాటం, వారి స్థానం—ఎంత అల్పమైనప్పటికీ—వారు సాధించిన హోదాలు గమనింపదగినవే. పోరాటం చైతన్యంలో నూతనమైనటువంటిది; ఆచరణలో విరామ మెరుగనిది. 1911 విప్లవకాలంలో గూడ మనకు స్త్రీవిప్లవసైన్యం వుంది. తమ పాదాలకు స్వేచ్ఛ కోరినందుకుగాను అనేకమంది దారుణంగా శిక్షించబడ్డారు. 1925-27 విప్లవకాలంలో తమ వెంట్రుకలను కత్తిరించుకొన్నందుకు హింసించబడ్డారు.



మన దృష్టిలో, అవన్నీ చాలా సామాన్యమైన విషయాలు. ప్రపంచంలో అందరితోబాటు హోదాలోను, విలువలోను సమాన మానవమాత్రులుగా పరిగణించ బడటానికి, ఆవిధంగా గుర్తించబడటానికి, మనకు స్వాతంత్ర్య హక్కు కలదని నిలద్రొక్కుకొనడానికి సాయుధులుగాగాని, నిరాయుధులుగాగాని పోరాటమంటె మనకు అత్యంత సహజంగా బోధపడుతుంది. దాన్ని గురించి ఆలోచించడానికి ప్రత్యేకశ్రమ చేయనవసరంలేదు. ప్రపంచం మనల్ని గురించి ఏమనుకుంటుందో లక్ష్యపెట్టవలసిన అవసరం లేదు.

ప్రస్తుతం జాతీయవిముక్తి పోరాటం మనయందు ఖచ్చితమైన రాజకీయ క్రమశిక్షణను ఆశించినట్లయితే, జాతీయ విముక్తి పోరాటం, సాంఘికవిముక్తి పోరాటం, రెండూ తోడుగా సాగవలసినదేననే వివేకం, కృతనిశ్చయత మనకుంది.

విదేశీయ రచయితలచే మనం వీరులంగా చిత్రించబడడం అనపేక్షితమైనటువంటి విషయం. మన ఆశయం, కార్యక్రమాలయెడ మనం పూర్తి జాగరూకులమై యున్నప్పటికీ, ఆత్మాభిమానంగల ప్రజలు నెరవేర్చవలసినటువంటి, సహజంగా నెరవేర్చేటటువంటి దానినే మనం చేస్తున్నాం. బహుశా కొంచెం అధికంగా చేసియుండవచ్చు. కాని ఆలాంటి సహానుభూతి రచనలనుండి మనంపొందిన ప్రోత్సాహం సౌహార్ద్రత (ముఖ్యంగా వివిధ దశల్లో చైనా స్త్రీల పోరాటాన్ని వివరించే ప్రస్తుత యీపుస్తకం) మాకు ఎంతో ఉపకరించాయి. మేం ఏమిచేస్తున్నదీ ప్రపంచం వీక్షిస్తున్నది. మాకు అనంత సహాకారాలను చేకూరుస్తున్నారు. సత్యాం ఖండఖండానికీ మారు

మ్రోగుతోంది. విషయస్ఫూర్తిగల మానవులు మనసారా వింటున్నారు.

అనిల్ డి సిల్వా తన చేతితోనేకాదు వ్రాసింది. ఒకే సారి ఇండియాకు, చైనాకు స్పందించే ఉమకు హృదయముతో వ్రాసింది. ఈ పుస్తకంలో వివరించబడిన కథలు, యీ పుస్తకం వ్రాయడానికి ప్రేరేపించిన కథలకంటె ఇదిమహోన్నత మైనది. ఆమె స్వాతంత్ర్యాశయాన్ని, దానికొరకు పోరాడే వాంఛను బహిర్గతం చేయదలచుకొన్నది. విచారకర విషయమేమంటే, స్వాతంత్ర్యం మానవుని ప్రాణంగా ఎంచబడినప్పటికీ అది అత నికి బహుకాల పీడన, హింస, బాధలు, శ్రమ, పోరాటం, కన్నీరు, రక్తం, కార్చడంతో సహా జరగనిదే లభ్యంకాదు. మానవచరిత్రలో స్వాతంత్ర్య ప్రదాయకు లంటూలేరు. చరిత్ర స్వాతంత్ర్యవిజేతలను అభినందిస్తూంది. ఇది బాధాకరమైనప్పటికీ ఘనమైనటువంటిది.

యాంగ్ కాంగ్.

# రేపు

హాన్ నదీమతల్లి గానం చేస్తున్నది,
హన్ నదీమతల్లి గర్జిస్తున్నది,
తనకోపిత అలలను సుడి వేస్తున్నది,
నా క్రోధాగ్నిని ప్రతిధ్వనిస్తూ;
హాన్ నదీమతల్లి పుత్రుణ్ణి నేను,
ఆమె విశాలహృదయపు ముద్దుబిడ్డను:
వీచే వాయువునుండి నే వింటున్నా
దుఃఖ, వేదనా ఆక్రందనాలు,
అవిరామ ప్రవాహంనుండి నే గ్రహించా
ప్రతిఘటనా దృఢవాంఛను.

జల ప్రళయపు అనంత సముద్రం,
నిర్జన వల్లకాటి భూమిలో,
శవాలగుట్టలు గబులుకొట్టే భూమిలో,
చిట్టెలుకలు, గుంటనక్కల బలిహారమైన జగత్తులో,

ఏకాంతపు లోయలోనే విహరిస్తే,
వ్యాకులుడునై దుఃఖిస్తా
అదే నన్ను బంధిస్తుంది, ద్వేషాన్ని పూరిస్తుంది
యుద్ధపు కీలుబొమ్మలోనికి నే పెరికివేస్తా
నాహృదిని గుచ్చే వేలాది తంత్రులను,
నే స్వరం విప్పుతా గొంతెత్తి పాడేందుకు.
శుద్ధ ప్రేమ గీతికను ఆలపిస్తాను.

మీరు ఏలుగెత్తి చాటుతారు,
మా తుపాకుల చేపడతాం.
నీటిచెలమకు పరుగెత్తే దప్పిగొన్న అశ్వంవలె
యుద్ధరంగానికి ఉరుకుతాం
అక్కడే మనవిధి నిర్ణయమవుతుంది.

మానవసమాజ ప్రేమకొరకు
మన కలుషితభూమికి స్వస్థత చేకూర్చేందుకు
దుష్టశత్రువులపై 'బాంబులు' విసరుదాం:
మన ప్రజల సౌభ్రాతృత్వమునకై
మరి సువర్ణ భవితవ్యంకొరకు
ప్రపంచపు కుళ్లును దహించివేదాం
మలినములన్నిటి కడిగేద్దాం.

మన ప్రియతముల కొరకై
మన రక్తాన్ని ప్రాణాన్ని, హృదయాన్ని అర్పిద్దాం
దారుణ యుద్ధంలో వీరమరణమో,
లేక వీరస్వర్గమో సాధిద్దాం.

మనదేశ భక్తికొరకై
విజయంవరకూ పోరుదాం
మనపెదిమలపై ప్రేమగీతికల స్వరముపల్కగా;
మనసైన్యపుక్రోధం
హూణనదికంటెను భయంకరమైనది,
దాని క్రూరతరంగాల గర్జనకంటెను గంభీరమైనది.

సమయంలేదు, విశ్రాంతిలేదు! మనసంకల్పంతో మాత్రమే
ఆ సౌభాగ్య సుదినాన్ని ఆహ్వానించ సాహసించగలం.
ఇక మనం స్వేచ్ఛగా గెంతినప్పుడు, మరి పరవశమై
గానం చేసినపుడు.

నిన్నటి అవమానం కడిగేద్దాం,
మన అభాగ్యభూమిని వాడి అధరములతో ముద్దిడుదాం,
మన మృదుజిహ్వాలతో ఆ మెగాయాలను ఉపశమింపజేద్దాం.

# తొలిపలుకు



ఆమె సౌందర్యకీర్తి దేశమంతటా వ్యాపించిన కారణంగా ఆమెను వివాహమాడగోరి, ఆమెభర్తపై దండెత్తి అతనిని చంపిన చక్రవర్తిపేరుగాని, ఆమెపేరుగాని నాకు సరిగా జ్ఞాపకంలేదు. కాని నే నెరిగిన ప్రథమ చైనాయువతి బొమ్మ, నా పుస్తకంలో ఉన్న బొమ్మనుగూర్చిన ప్రతి సూక్ష్మవివరం నేను బాగా ఎరుగుదును.

ఆమె చాలా పొడగరి. సౌందర్యరాశి. చైనీస్ బ్రొకేడ్ తేలిక ఆకుపచ్చరంగుగల దుస్తులను ధరించేది. ఆమె శరీరం నుండి పద్మసుగంధం విరజిమ్ముచుండేదని కథలుగా చెప్పుకునేవారు. చక్రవర్తిగారి రాజధానికి కొని పోబడేటప్పుడు (కొన్ని నెలలు ప్రయాణం) ఆమెఅందం చెక్కుచెదరకుండా ఉండేటందుకు ఆమెకు ప్రతి విలాసవస్తువు అందించబడుతుండేది. ప్రతి మజిలీలోను ఆమెస్నానంకొరకు పాలు సప్లయి చేయబడేవి.

ఈ కథాంతంగూడ నా మనస్సులో నిలిచియుంది. ఆమె ఆచక్రవర్తికి, తాను ఒంటరిగానే ఉందుననీ, అతనిని పెండ్లియాడుటకు బలవంతపరచేపక్షంలో ఆత్మహత్య చేసుకోగలనని ఖండితంగా చెప్పివేసింది.

పసివాని హృదయాన్నిసైతం స్వాధీనపర్చుకున్న సుందర శాకుమారిప్రతిమ చాలాకాలంనుండీ మరోచిత్రానికి స్థాన

మిచ్చింది. ఈసారి ఒక్క అమ్మాయి ఛాంగ్. లొంగిపోబోయే ముందు అప్పటికే యుద్ధంలో రెండుసార్లు కాల్చబడింది. చైనాలో పలిభాగంలో ఒక ఏకాంత పర్వతంపై సమాధిచేయబడింది. ఆమె సమాధిపై, ఆమెతోటి కామ్రేడ్సు సమాధులపై అరుణ పతాకం విరాజిల్లుతోంది..........

ఈ కడపటిచిత్రం నాకేగాకుండా, వేలాదిస్త్రీలకు జీవిత యాదార్థ్యం. ఈ చిత్రమే బ్యానరులాగా ఉచ్ఛస్థాయికి గొని పోబడింది. ఆ అమ్మాయి ఛాంగుయొక్క మనస్తత్వమే పీడింప బడేటందుకు అనుమతించని లక్షలాది చైనాస్త్రీలలో ప్రచలిత మవుతోంది.........

ఈరెండు పరస్పర విరుద్ధ చిత్రాల్లోను రెండు ప్రపం చాల సారాంశముంది. రెండు ప్రపంచాలు— ఒకదానికొకటి భిన్నమైనప్పటికీ, రెండూ సన్నిహితమైనట్టివే. మొదటి చిత్రం నన్ను మగ్ధురాల్ని చేసింది; పురాతనచైనా సుకుమారయువతి పరిమళాన్ని ఆస్వాదించాను.........ఎంత త్వరితంగా జ్ఞాపక శక్తి మాయమవుతుంది? ఆశ్చర్యం ! దానితోబాటు ఆ సౌం దర్యవ్యక్తియొక్క రసికతగూడ మాయమయింది. ఆస్థానంలో మరొక భయంకరమైన, వెంటాడే దృశ్యం, ఆ అమ్మాయి ఛాంగ్ మరణదృశ్యం వస్తుంది. ఆ సతీ ఛాంగ్ ఎవరు? చక్ర వర్తి హృదయాన్ని కలవరపరచిన కీర్తిగన్నల సౌందర్యమా? కాదు. ఆమె తనలాంటి లక్షలాదిప్రజల హృదయాల నుత్తేజ పరచిన వినయ నమ్రశీలయైన ఒక రైతు బిడ్డ.

నూతన విలువగల ప్రపంచానికే ఆమె చెందుతుంది. ప్రపంచంలో లక్షలాది స్త్రీహృదయాలను ఊగుతున్న విప్లవ

తత్వానికే చెందుతుంది. విముక్తి తత్వ ప్రకటన చైనాలో అమోఘంగా ప్రదర్శిత మవుతుంది. చైనాయొక్క శతాబ్దాల గాఢసుషుప్తి విప్లవభేరీలతో చెదరిపోయింది. మందకొడితనం, జీవన్మరణ పరిస్థితులను పూర్తిగా ఖండించడముతో పురాతన జాతి స్వభావాన్ని క్రమంగా మార్చివేసింది. ఆ విప్లవభేరీల పిలుపునకు, తమ స్వప్నాలలో మెలుగుచున్న నూతన ప్రపంచంకొరకు తమప్రాణాలను సైతం అర్పించడానికి సంసిద్ధులయ్యే స్త్రీలప్రవాహమే సమాధానం.

వారు అది ఎలా సాధించగలిగారు? అజ్ఞానం, క్రూరత్వం, అవమానకర జైలుగోడలను ఎలా భేదించగలిగారు? నూతన చైనా చరిత్రయే చైనా స్త్రీల భావపరిణామ చరిత్ర. ఇక్కడ మనకు ఇండియాలో, మనస్త్రీలుగూడ తమ దేశ విముక్తి కొరకు తమపాత్ర నిర్వహిస్తున్నారు గనుక మనకు ఎక్కువవిశిష్టత వుంది. మనంగూడ వారితోబాటు ముందు రానున్నప్రపంచంకొరకు, పోరాడి నిర్మించవలసినటువంటి చక్కటి రహదార్లు, మనోల్లాసకరనందనోద్యానములు గల భవిష్యత్తు కొరకు గలలుగందాం, తోడుతోడుగా సహకరిద్దాం.

---

నేను, నాకాలానికి సౌందర్యకుసుమమైన నేను,
పాడువడీన లోయలో బ్రతుకుతున్నా;
హైన్యంగా పరికించు నాభర్త,
అయినా, అతనినూత్న గృహిణొక దుష్టముండ,
సుప్రభాతంగూడ అశాశ్వతమే........
శీతలఋతువిధి, నా నీలి
లకుముకి దుస్తులు సన్నమైనవి,
సాయం సమయానికి, పొడగరి వెదుళ్ళకు
నే వ్రేలాడుతా, (సుదినాల నిరీక్షణతో).

## 'నీలి లకుముకి దుస్తులు'

నీలి లకుముకిదుస్తుల్లో ఉండే దౌర్భాగ్య స్త్రీ పురాతన చైనాకే చెందినటువంటిది. స్త్రీలపై అపసవ్య నిర్బంధాలతో ఆమె ఆచారవ్యవహారాలు చాల వింతగా మాఢ్యంగా వుండేవి. స్త్రీల నిస్సహాయత్వం వారి ఆర్థిక పరాధీనత, వారి సంకుచిత జీవితాలు వారిని అజ్ఞానులుగా, నిస్సహాయులుగాచేసి గృహస్థ జీవితానికిమాత్రమే కట్టుబడి యుండాలని అభిలషించేవారి దృష్టిలో మాత్రమే మహత్వ గుణాలుగా పరిగణింప బడేవి. చైనాలో స్త్రీలు తమ పాదాలను సక్రమ పరిణామానికి పెరగ నీయకుండా పసితనంనుండి గట్టిగా బిగించేవారు. శతాబ్దాల తరబడినుండి, 14 శతాబ్దాల పూర్వం చెన్‌హోన్‌ఔన్ చక్రి

వ్రత్తియుక్క ముద్దుసరదాణి యీ ఫ్యాషనును ప్రవేశ పెట్టినదాదిగా యీ చిన్నిపాదాలు అత్యంత సౌందర్యానికిచిహ్నంగా మురుసుకోవడం ఆ స్త్రీలకు నేర్పబడింది.

ఆ చక్రవర్తిగారి ఉంపుడుకత్తె తన విటుని మురిపించేటందుకుగాను తనపాదాలు చంద్రునిపోలియుండునట్లు చాల గట్టిగా నొక్కివేసింది. ఆమెనుచూచి మరికొందరు స్త్రీలు అలాగే ప్రారంభించారు. క్రమంగా యిది ఎంతగా నిఖిల ప్రచారమైనదంటే యీ పద్ధతిని వ్యతిరేకించిన అమ్మాయిలను దారుణంగా శిక్షించేవారు.

తమ యజమానుల్ని మెప్పించడమే స్త్రీల పరమావధి అయింది. పాదాలను సంకుచిత పరచే అసహజమైన పద్ధతియే, స్త్రీ తన భద్రతకొఱకు, ఆర్థికక్షేమంకొరకు ఎన్ని అగచాట్లు పడవలసివచ్చిందో తెలుపుతుంది. భద్రంగా జీవించే నిమిత్తం అవమానకర పరిస్థితులకు తలొగ్గే స్త్రీల మనస్తత్వ అంతరార్థాన్ని యిది వివరించుతుంది. ఎందుకంటే, తమయజమానుల్ని మెప్పించనిదే వారు సౌఖ్యంగా బ్రతకలేరు. ఎలాగైనా, యింతటి విచారకరమైన విషయంగూడ చక్కనివందనమైన పదజాలంతో బహుజాగ్రత్తగా కాలదన్నేవారు. చివరకు యీ ఆచారం గొప్పసౌందర్యచిహ్నంగా పరిగణించబడేది. కవులు రచయితలు అలాంటి పాదాలను "గోల్డెన్ లిలీస్" (బంగారు కలువలుగా) చిత్రించేవారు.

హాన్ చక్రవర్తుల భూస్వామ్య సమాజంగూడ ఇలాంటి సాంప్రదాయక ఆచారాలను గొప్పవారికితగనివిగా, అయోగ్యమైనవిగా భావించింది. హాన్ చక్రవర్తుల స్వర్ణయుగానికిపూర్వం

బొసనే స్త్రీలను, ఉంపుడుగత్తెలను పొరి చనిపోయిన భర్తతో సహా దహనం చేసేవారు. హాన్ చక్రవర్తులు అలాంటి అమానుష సాంప్రదాయాలను నిరసించారు. అయితే అలాంటి ఆచారాలు ఎలా ఉద్భవించాయి ? బహుశా అలాంటి ఆచారాలు ఘోరఆర్థిక సమస్యలనుండి ఉద్భవించి యుంటాయి. భర్త చనిపోయిన తరువాత యిక ఆ బానిసలగతి ఆలోచించేవారెవరు ? అలాంటి భయంకరమైన పరిష్కారమార్గం, ప్రస్తుత మనస్తత్వ దృష్ట్యా అంతటిహేయమైన పరిష్కారమార్గం పురాతనచైనా ప్రజలకు చాలసులభమార్గంగాతోచియుండవచ్చు.........! ఆ సమాజంయొక్క సాంస్కృతికస్థాయిని గూర్చిన కఠినమైన వ్యాఖ్యానమది. ఆరోజుల్లో స్త్రీలకు అంత హైన్యమైనహోదానిచ్చేవారు.

మింగ్ చక్రవర్తుల కాలంలో (1368-1644) మంచూ టార్టారులు వ్యాక్ క్వే చక్రవర్తికి ఒక తిరుగుబాటును అణచుటలో సహాయపడి, చైనానుండి తిరిగివెళ్ళిపోవుటకు తిరస్కరించినప్పుడు వారు చక్రవర్తిని లొంగుబాటు పత్రింపై సంతకం చేయవలసినదిగా బలవంత పర్చిన విషయం గమనించదగ్గది. ఆ ఒడంబడికలో నాలుగుషరతులు ఉన్నాయి. అందులో రెండు షరతులు స్త్రీలనుగూర్చినవి. ఒకటి, చైనా స్త్రీలు టార్టార్ల దుస్తులనే ధరించాలని, టార్టార్ స్త్రీలవలె తమజుట్టును తోకలాగా (జడవలె) ముడుచుకొనవలెననే నిర్బంధం ఉండరాదనీ, రెండవది, తమపాదాలను సంకుచితపరచుకొనుటకు యిష్టపడని వారిని నిర్బంధించరాదని.

ఆర్థిక అస్వతంత్రపు భయంకర భూమికతో గూడ, స్త్రీల మానసిక బానిసత్వంతో గూడ, సాంఘిక కట్టడాల నన్నిటిని అధిగమించి భూస్వామ్య సంకుచిత హద్దులు ఏర్పరచబడినప్పటికే గొప్పస్త్రీల బృందం తమ విజయాలద్వారా చైనా సంస్కృతికి ఎంతో తోహదమిచ్చారు. చైనాచరిత్ర అంతటా స్త్రీల యీ ఘనవిజయాలు ప్రకాశహీనంగా వుండే జల్తారు జాలరు అనే మానవజీవితానికి వెండితీగల్లా వుంటాయి. అటువంటి స్త్రీలు కళల నభివృద్ధిపరచి ప్రజల విజ్ఞానగనిని మరింత విస్తృతంచేశారు. ఆనాటిస్త్రీలందరికీ స్వేచ్ఛాయుత సౌఖ్యప్రదజీవితంపై ఆశలను కలుగజేశారు.

గ్రేట్ వాల్ ఆఫ్ చైనాను (చైనాలో గొప్పగోడకట్టడం) నిర్మించిన చక్రవర్తిగారి భార్యయే పట్టుపురుగుల పెంపకాన్ని కనిపెట్టడంలో ప్రసిద్ధికెక్కింది. పూనూ, ఒక విద్వాంసురాలు. ఎంతగాకీర్తిని సంపాదించిందంటే ఇంపీరియల్ ఎకాడమీలోని గొప్పగొప్ప డాక్టర్లకు తన అహార సిద్ధాంత విజ్ఞానాన్ని అందజేయవలసినదిగా ఆర్డరుజారీచేయబడింది. క్రీస్తుశకం మొదటి శతాబ్దంలోని పాన్‌చావో ఒకగొప్ప ప్రసిద్ధికెక్కిన చరిత్రకారిణి. ఈ ప్రముఖవ్యక్తులే చైనాస్త్రీల తరుగని విజ్ఞానసంపదల ప్రతిబింబం. కాబట్టి ప్రస్తుతకాలానికి మనం వచ్చినపుడు మదాం సన్‌యట్‌సన్ గొప్పతనానికి గాని, చైనాలో నూతన స్త్రీల గొప్పతనంగూర్చిగాని, యుద్ధంలోను, రాజకీయాల్లోను పాల్గొని, స్త్రీలస్థానం యిట్లానేననే సాంప్రదాయాల్ని పారద్రోలిన స్త్రీలఔన్నత్యం చూచిగాని మనం ఆశ్చర్యపడవలసిన పనిలేదు.

పురాతన చైనాసమాజంలో చేర్పింపబడిన మార్పులు క్రమంగా చైనాను, చైనాప్రజల మనస్తత్వాన్ని మార్పు చేశాయి. ఈ మార్పులను స్త్రీలు ప్రత్యేకంగా స్వీకరించారు. కొరియాగుండా జపాను ప్రమాదం నిద్రమత్తులోనున్న భయం కర మొసలిని మేల్కొలిపినట్లయింది. సామాజిక పరిస్థితులు మార్పునకు సిద్ధంగా వున్నాయి. మంచూచక్రవర్తుల పీడక రాజ వంశం ఒక గొప్పసాంఘిక విప్లవంచే, పాశ్చాత్య పారిశ్రామిక విధానంతో గల చైనావాణిజ్య సంబంధాలద్వారా తేబడిన విప్లవంద్వారా ఊడిపోయింది. వర్తకంలో సామ్రాజ్య పెత్తనం విస్తరణ, స్వదేశపరిశ్రమల నరికట్టడం, చైనీయులపై బలవం తంగా విదేశసరకులను రుద్దడం, ఇతర దేశాలలో జరిగిన అను భవమే యిక్కడా జరిగింది. ప్రజలు పురాతన ఆచారవ్యవహా రాలను, సాంప్రదాయాలను ప్రశ్నించసాగారు. నూతన ప్రపం చంలోకి చైనాను పురోగమించనీయకుండా ఆటంకపరచిన ఆలాంటి ఆచారవ్యవహారాలు తప్పకుండా రద్దుపరచవలసిందే నని అన్నారు సంస్కరణ వాదులు.

ఈ ఉద్దేశ్యం, రాజశాసనంద్వారా పాదాలను బంధిం చడమనే దురాచారాన్ని రద్దుచేయవలసినదిగా చక్రవర్తిపై ఒత్తిడి తెచ్చిన కాంగ్ యు లేయ్ సాగించిన సాంఘిక సంస్కర ణోద్యమంలో ప్రస్ఫుటమే. జపానుదురాక్రమణ ప్రమాదం, విదే శీయరాజ్యాలను ఆధికబానిసత్వ అవమానాలు చైనాజాతీయచైత న్యాన్ని మేల్కొలిపినాయి. జాతీయవిముక్తి ఉద్యమం ప్రారంభ మైంది. నవీనపరిపాలనను సంబంధించిన సమస్యలను పరిష్కరించ డంలో భూస్వామ్యమెంచూల అసమర్థత ఈ ఉద్యమానికి శక్తి

నిచ్చింది. ఆఉద్యమమే ఆశయసిద్ధికొరకు అనేకమంది స్త్రీలను ఉత్సాహపర్చి సాంఘికజీవితంలో పాత్రవహించేలా చేయగలిగింది. ఆ స్త్రీలు ఈ బంధితపాదాలు ఈ 20 వ శతాబ్దంలో జీవితావసరాలకు ఎంత అనర్థకమో గుర్తించారు. వారి ఉత్సాహం, పట్టుదల "వేయ్" సోదరులు ఆరంభించిన సాంఘిక సంస్కరణోద్యమానికి, ప్రజాజీవితంలో ఒక గొప్పశక్తిగా తయారగుటకు సహాయపడ్డాయి.

బాక్సర్ రైజింగ్, (Boxer Rising) దానితరువాత, పేకింగ్‌లోని గొప్ప కళాసంపదలను పాశ్చాత్య యూరోపియన్ రాజ్యాలవారు సైన్యసహాయముతో చేసినలూటీలు, జపాను, ఫ్రెంచి, డచ్, బ్రిటీషు, అమెరికా సామ్రాజ్యప్రభువులు చైనాపై సాగించిన తదితర అవమానాలు పిరికిగా లొంగిపోవడం నూతనచైనాకు అసంభవం చేసినాయి.

నశించిపోతున్నటువంటి, అవినీతిపరులైన మంచూపాలకులు విదేశసామ్రాజ్య శక్తులనుండి వచ్చేప్రమాదాలను తప్పించలేరని యువచైనా వెంటనే పసికట్టింది. జాతీయవాదులు మరోవైపు దృష్టినిలిపారు. వారిదృష్టులు యీ యుగంలోని చైనా సృష్టించిన మహత్తర వ్యక్తియందు, డాక్టరు సన్‌యట్ సేన్ యందు నిలిపారు. విప్లవకరమార్పు అంతటా పురుషులలో రత్నంగా సన్-యట్-సేన్ ప్రశస్తి పొందితే, ఆయనభార్య, చింగ్‌అంగ్, మదాంసన్, చైనాలో నూతనస్త్రీత్వానికి ఆమె నమూనా. ఆమెను యీకాలం సృష్టించింది. ఆమె కాలాన్ని ప్రభవింపజేసింది. తన మహత్తర విప్లవవిజయాలద్వారా కాలాన్ని ఉద్ధరింపజేసింది.

"ముప్పది శతాబ్దాల గాఢనిద్రనుండి వారు మేల్కొన్నారు. ఇక వారు ఎన్నటికీ వెనక్కు మరలరు."

—మాల్‌రాక్స్.

# తుపాకి రాజ్యం పోవాలి! ప్రజాతంత్ర జండా నెగుర వేయాలి!



చింగ్ అంగ్ తండ్రి, సన్‌యట్‌సేన్ జాతీయ ప్రియత్నాలకు పూర్తిగా సహాయపడినటువంటి ఛార్లీ సూంగ్ కుటుంబం గొప్పప్రాధాన్యత కలిగినట్టిది. ముగ్గురు అక్కచెల్లెళ్లు ఒకసోదరుడు తండ్రితోసహా అందరూ చైనాజాతీయ జీవితంలో అమోఘంగా తమ పాత్ర నిర్వహించారు. ఒకసోదరి జంగ్-కై-షేక్‌ను వివాహమాడింది. ఒకామె పెద్దబ్యాంకరు కుంగ్‌ను, రెండవసోదరి డాక్టరు సన్‌యట్‌సేన్‌ను వివాహమాడారు.

ఆమెజీవితం అత్యంత ప్రాశస్త్యంకలిగినట్టిది. ఆమె ఘన విజయాలు సన్‌యట్‌సేన్ జాతీయవిప్లవంతరువాత చైనాసమాజంలో కలిగిన మహత్తర మార్పుల భూమికలోనే వివరించబడాలి.

ముగ్గురు అక్క-చెల్లెళ్లు విద్యకొరకు అమెరికా పంప బడ్డారు. ఛింగ్ లింగ్ జార్జియాలోని వెస్లెస్లీ కాలేజీలో తత్త్వ శాస్త్రం అధ్యయనం చేసింది. ఆమె శ్రద్ధతో చదివింది. గంభీర విషయాలలో అభిరుచికలిగియుండేది.

కాలేజీలో చదువుతున్నప్పుడు ఆమె చాలవ్యాసాలు వ్రాస్తుండేది. అందులో ఒకటి— "చైనాపై విదేశాలలో అభ్య సించిన విద్యార్థులభావం" అని.

రెండవది, 1911 లో మంచూ చక్రవర్తులను పతనం గా వించిన సాంఘిక, రాజకీయ విప్లవ స్వభావాన్ని చక్క-గా వివ రించినటువంటి "20 వ శతాబ్దపు మహత్తరఘట్టం" అనేది. ఇది అత్యంత మహత్తర ఘనవిజయం అంటే జీవితం, స్వాతంత్ర్యం, సౌఖ్యం ఇవన్నీ తిరస్కరించి 400 సంవత్సరాలకు పైగా పరిపా లించిన రాజరికాన్నుండి 400 మిలియన్ల హృదయాలను విముక్తి గావించడమన్నమాట.

ఆమె స్పష్టంగా జరిగిన మార్పులకు గల కారణాలను గుర్తించింది—పందితోకలను, (జడలను) పాదాలను బధించడం రద్దుచేసిన సంస్కరణలు. కాని ఆమె యౌవనంలో ఉండుట చేత, విప్లవం స్వేచ్ఛ, సమానతలను స్థాపించినప్పటికీ సౌభ్రా తృత్వాన్ని ఆచరణలో నెలకొల్పడం యింకా సాధించవలసి యుందనీ, నిజమైనశాంతి, అభ్యుదయం పురుషులు వొకరినొకరు సోదరులుగా భావించుకొననిదే సాధ్యపడదనీ ఆమెగ్రహించింది. ఎలాగైనప్పటికీ, అవమానకర సాంఘికదురాచారాలను నిర్మూ లించుటకు సంస్కరణవాదులు బరిపిన ప్రయత్నాలలో సౌఖ్య ప్రదమైన భవిష్యత్తునకు మార్గం కనబడింది. శాంతియుత, సంఘ

టితె సమాజాన్ని నిర్మించుటకు పునాది చైనీయులలో ఉండనే ఉంది. చైనా సంస్కృతిని, వారికిగల గొప్పబుద్ధిసూక్ష్మతను చాలమంది గుర్తించారు. ఛింగ్‌అంగ్, చైనాలోని యునైటెడ్ స్టేట్స్ మాజీమంత్రి మిష్టర్ కాంగర్‌ను ఉదహరించింది. చైనాలో ప్రపంచంలోకెల్లా గొప్ప నాగరికత కానవస్తుంది. చైనా తన భిన్నరకాల ప్రజలతో, శాంతియెడ తనకుగల యథార్థమైన అభిలాష—నిండు అర్థంలో — శాంత్యవతారంగా నిలబడుతుంది."

ఛింగ్‌అంగ్ మార్పు, నూతనచైనాను వాంఛించింది. ఆమెకు తన ప్రియతమదేశంలో భావసంపదలయెడ అత్యంత విశ్వాసముంది. ఒకసారి సమర్థంగా వారిని సంఘటితపరచిన యెడల చైనాయొక్క లక్షలాదిప్రజలకు చుట్టుగల ప్రపంచంలో గల అరాజకం, దురాక్రమణ, యుద్ధానికి వ్యతిరేకంగా ఒక బలవత్తరమైన శక్తిగా తయారవుతారు.

ఒకవింత కథవుంది. ఒకసారి ఛింగ్‌అంగ్‌కు ఆమెతండ్రి ఒకక్రొత్త ప్రజాతంత్ర జండాను పంపించగానే ఆమె పురాతన "డ్రాగన్ బ్యానరు"ను (శతాబ్దాలతరపడి దాస్యచిహ్నం) చించివేసి తన వూపిరికొద్దీ దాన్నిత్రొక్కి బిగ్గరగా యిలాఅరచింది. "తుపాకిరాజ్యం పోవాలి! ప్రజాతంత్రజండా వర్ధిల్లుగాక !" ఈ ఘటనచైనాయొక్క నూతనయువజనులకు సర్వసాధారణం. ఛింగ్‌అంగ్, ఆరోజుల్లో లక్షలాది జాగృత యువతీయువకులు అభిప్రాయపడినదానినే యథార్థంగా ప్రతిధ్వనించింది.

ఆకాలంలోనే ఛింగ్‌అంగ్ అమెరికానుండి యింటికి తిరిగి వచ్చింది. [illegible] విప్లవస్ఫూర్తం కలిగిన [illegible]

టీకి విప్లవనాయకుని కలుసుకొనడమంటే ఎంత ఆహ్లాదకర విష యమో మనము వూహించుకోవచ్చు. ఆమె చిన్నతనంనుండి ఆయనను చూడలేదు. ఇపుడు ఆమెకు ఆయన తన తండ్రి స్నేహితునికంటె ఎక్కువైనాడు. అతడే నూతనచైనాకు నాయ కుడు. అయినా యీసమయంలో జాతీయఉద్యమం వెనకడుగు వేయడచేత సూంగ్‌లు, సన్, జపానుకువెళ్లి అక్కడ మారు పేరుతో వ్యవహరించవలసివచ్చింది. ఇక్కడే ఎలింగ్ తరువాత తనభర్తగామారిన కుంగుషీంగ్-హేయ్‌ను కలుసుకొన్నది. జపా నులోనే వారిరువురు పెండ్లిచేసుకొన్నారు. వారు పెండ్లిచేసి కొనడంతో సన్‌కు ఎవరూ శెక్రటరీగా లేకుండా పోయారు. అప్పుడు ఎలింగ్ సలహాపై, ఆబాధ్యతను ఛింగ్‌లింగ్‌ను వహిం చమని కోరాడు. సన్‌యట్‌సేన్ చిన్నతనంలోనే పురాతన చైనా ఆచారంప్రకారము పెండ్లిచేసుకొన్నాడు. అతనికి పెద్ద అయిన పిల్లలున్నారు. తరువాత కుటుంబానికి దూరంగా చాల సంవత్సరాలు గడిపాడు.

అతనికి ఛింగ్‌లింగ్‌యెడ ప్రేమకలిగింది. అదే ఆమె చిత్తస్థైర్యానికి పరీక్షఅయింది. తనకుటుంబమునుండి వచ్చిన ఆటంకాలకు, పెండ్లికుమార్తె కుటుంబమువారు ఏర్పాటుచేయ నిదే రెండవవివాహం ఆక్షేపణీయంగా పరిగణించే చైనాసమా జానికి వ్యతిరేకంగా ధైర్యంగా నిలబడగలిగింది. చివరకు ఆమె పారిపోయి సన్‌యట్‌సేన్‌ను కలుసుకొంది. దేశపురోగతి ప్రతి దశలోను ఆమె అత్యంతసాహసం, దీక్ష చూపింది. ఆమెభర్త యొక్క తేజోమూర్తిస్వరూపం ఎల్లప్పుడూ ఆమెయెదుట నిలిచి

టుండేది. ఆమె సనియట్ సెన్ సూత్రాలను సాధించేనిమిత్తం తన ప్రాణాలను సైతం ఒడ్డిపోరాడేది.

ఒక అమెరికన్ స్నేహితునకు ఆమె వ్రాసిన ఉత్తరంలో యిలావుంది......ఇదిచాల సులభసాధ్యమైనమార్గం. ఎందుకంటే మేం యిరువురమూ అదనపు ఉత్సవాలులాంటి వాటిని ద్వేషిస్తాం. నేనుచాల ఉల్లాసంగాఉంటున్నా. ఇంగ్లీషు ఉత్తర ప్రత్యుత్తరాల్లో నాకు సాధ్యమైనంతవరకు నాభర్తకు సహాయ పడుటకు ప్రయత్నిస్తున్నా. నాఫ్రెంచి చాలవరకు అభివృద్ధి అయింది. ఇపుడు నేను ఫ్రెంచిపత్రికలను చదవగలుగుతున్నా. ఒకసారి చూడగనే తర్జుమాగూడ చేయగలుగుతున్నా. కాబట్టి వివాహం అనేది నాకు ఒకస్కూలుకువెళ్లడంగా భావించుతున్నా. కాకపోతే నన్నుబాధించే పరీక్షలుమాత్రం యీ స్కూలులో లేవు."

వివాహం జరిగాక ఆమె తనభర్త జీవితంలోని ప్రమాదాలు, సుఖదుఃఖపు ఒడుదుడుకుల్లో అన్నింటా పాత్రవహించింది. ఆమె అతని కార్యదర్శిగా పనిచేసింది. ఆయనతో బాటు ప్రతిచోటికి ప్రయాణంచేసింది. బహిరంగసమావేశాల్లో పాల్గొన్నది. తనభర్త సాహసిక జీవితపు ప్రత్యేకత అయినటువంటి ప్రమాదాలు, గండాలనుండి హఠాత్ గా తప్పించుకోవడంలోగూడ ఆమెకు పాత్రవుంది. సన్ జీవిత చరిత్రఅంతా ఒక వింతైన రసికనవల. మృత్యుముఖంనుండి తప్పించుకొన్న చర్యలు, అతని అనుయాయుల భక్తిశ్రద్ధలతోగూడిన కథలు, ప్రతి ప్రమాదంనుండి ఆయనను రక్షించిన అతని అనుయాయుల భక్తివిశ్వాసాలతోనే ఆయన జీవితచరిత్ర నిండియుంటుంది.

ఛింగ్ అంగ్ చివరలో అతిత్వరలోనే విప్లవమార్గం ఏమాత్రం సులభంకాదని, స్వార్థం, దురాశలకు వ్యతిరేకంగా మానవశ్రే యస్సుకోసం పోరాడటం అత్యంతప్రమాద భరితమైన జీవిత మనీ గ్రహించి యుండవచ్చు.

అద్భుతమైన, ఆశ్చర్యకరమైన పరారీలలో ఒకటి కాం టన్‌నుంచి తప్పించుకొనడం చాలచక్కగా వివరిస్తుంది. ఒక తిరుగుబాటు యుద్ధ ప్రభువు సన్ సైన్యాలు యుద్ధరంగంలో ఉం డగా తన సైన్యాలను కాంటన్‌కు నడిపించాడు. డాక్టరు సన్ సైన్యాలు కేవలం 500 మంది మాత్రమే. కాని తిరుగుబాటు సైన్యంలో 25000 మంది ఉన్నారు. రోజురోజూ యింకా వృద్ధిఅవుతున్నారు. లూటీలు ఆరంభమయినాయి. ఆమె అం టుంది.

"జూన్ 16న రాత్రి రెండుగంటలకు నేను సుఖస్వప్నా లను గాంచుతుండగా డాక్టరు సన్ నన్నులేపి త్వరగా దుస్తులు వేసికొనుమని తొందరపెట్టాడు. మనం ప్రమాదంలో నున్నా మని, తప్పుకోవాలని ఆయన తొందరగాచెప్పాడు......మనం యిపుడు వెంటనే యుద్ధనావ నెక్కి అక్కడనుండి మన సైన్యా లను తిరుగుబాటుదారుల్ని ప్రతిఘటించేటట్లు నడపాలి.

అతనివెంట ఒక స్త్రీవుండటం అతనికి అసౌలభ్యం అని నేను భావించి ప్రస్తుతానికి నన్ను యిక్కడనే వదలివేయవలసిం దిగా నేను ఆయన్ను కోరాను. నన్నుగా, నాకు పెద్ద ప్రమా దం లేదనిచెప్పాను. చివరకి, నావాదనలోని భావాన్నిగ్రహించి గృహసంరక్షణకొరకు 50 మంది బాడీగార్డులను వదలి తాను ఒకడే వెళ్ళిపోయాడు.



"అరగంట తరువాత, బోల సామీప్యంనుండి తుపాకి కాల్పులు వినవచ్చాయి. శత్రువు రెండువైపులనుండి కొండ దిగువనుండి "సన్ వెన్ను చంపండి. సన్ వెన్ను చంపండి" అంటూ కేకలువేస్తూ కాలుస్తున్నారు...... తెల్లవారగానే మన సైనికులు తుపాకులతోటి మిషన్ గన్నులతోటి సమాధానం యిస్తున్నారు. నా స్నానాలగది తునాతునకలైయింది. మా సైన్యాల్లో మూడోవంతునాశనమైంది. మిగిలినవారు పూర్వంకంటె ఎక్కువ కృతనిశ్చయంతో ధైర్యంతో పోరాడుతున్నారు............ 8 గంటలవ్వేసరికి మా దగ్గర తుపాకీగుండ్లనిల్వ తరిగిపోతోంది. అందువల్ల యిక కాల్చరాదని నిశ్చయించుకున్నాం. కాబట్టి యిక అక్కడేవుంటే ప్రయోజనంలేదు. మా కెప్టెన్ నన్ను అక్కడనుండి వెళ్ళిపొమ్మని సలహా యిచ్చాడు. సైన్యాలను అక్కడేవుండి శత్రువును పురోగమించనీయకుండా అడ్డగించటానికి ఆజ్ఞయిచ్చాడు......... తరువాత ఆ 50మంది చంపబడ్డారని తెలిసింది."

"మేం నలుగురం డాక్టర్ సన్‌కు విదేశ సలహాదారుగా నున్న కర్నల్ చౌ, మరియిద్దరు బాడీగార్డులు దైనందిన అవసరాలకు సరిపోను మాత్రం కావలసిన వస్తువులతో సహా తప్పించుకునేందుకు బ్రిడ్జిమార్గంవెంట పారిపోతూపోతున్నాం. శత్రువు వెంటనే కాల్పులు యీమార్గంమీద కేంద్రీకరించాడు. తుపాకి గుళ్ళధ్వని మాచెవుల్లో రింగుమంటోంది. రెండుసార్లు గుండ్లు నాకణతప్రక్కగా దూసుకుపోయినాయి......... వెంటనే మేం ఒకచోటుకు, రైలుపట్టాలు కాల్పులకు ధ్వంసం కావించబడిన చోటుకు చేరుకున్నాం. అకస్మాత్తుగా కర్నల్ చౌ అతి

చాడు. అతని తొడలోగుండా గుండు దూసుకుపోయింది. పెద్ద రక్తనాళం తీవ్రంగా గాయపడింది........."

తరువాత వారు రెసిడెన్సీలో, ప్రెసిడెంటుగారి భవనంలో ఆశ్రియంతీసుకొన్నారు. కాని అదిగూడ వెంటనే దాడికి గురిఅయింది. ఆమె చెప్పింది, "మేం కర్నల్‌చౌను ఒక పడకగదిలోపలికి తీసికొనివెళ్లి అతనిగాయాలకు కట్టుకట్టాం. అతనిబాధ చూడటమే నాకు కష్టమైంది. అయినా అతను మాత్రం "ఎప్పటికైనా విజయం మనదే." అని నన్నుఓదార్చేవాడు:

"ఉదయం 8 గంటల లగాయతు సాయంకాలం 4 గంటలవరకు యథార్థంగా ఎడతెగని తుపాకికాల్పుల నరకంలో ఉన్నాం. ఒకసారి కొద్దినిమిషాలు పూర్వమే నేను విడిచి వచ్చిన గది పై కప్పు కూలిపోయింది.

"నాలుగుగంటలకు వారు మాతో శాంతిసంధికొరకు ఒక ఆఫీసరును పంపారు. మా బాడీగార్డు పెట్టిన ప్రిథమమరతు యేమంటే నాభద్రిత. కాని ఆ ఆఫీసరు నాభద్రితకు గ్యారంటీ యివ్వలేనన్నాడు.........మా ఇనుపతెరలు పటాపంచలయ్యాయి. రక్తదాహంగొన్న బాయొనెట్లు, రివాల్వర్లు మమ్ము చుట్టుముట్టాయి. వారు మా వ్యక్తులకొరకు కాకపోయినా మా దగ్గరనున్న వస్తువులకొరకు వచ్చారు. వెంటనే యిదే అవకాశంగా తీసికొని పారిపోతున్న సైనికులు, లూటీదారులు చెల్లాచెదరుగా పరుగెత్తుతున్న సమయంలో మేంగూడ పరుగెత్తాం. కర్నల్‌చౌ టోపీపెట్టుకొని, డాక్టరుసర్ రెయిన్‌కోటు ధరించి నేను తప్పించుకోగలిగాను.........

"ఆ గుంపులోగుండా మేం మాదారిచూచుకున్నాం. ఆ లూటీదారుల్ని తప్పించుకొని ఒకచిన్న సందులోకి చేరుకున్నాం. నేను అప్పటికి పూర్తిగా అలసిపోయాను. అందువల్ల నన్ను కాల్చివేయవలసినదిగా నాగార్డులను నేను కోరాను. కాని వారు నన్ను చెరియొకపక్క ఉండి లాక్కుపోయారు...... ఎక్కడచూచినా శవాలే. కొన్ని పార్టీవారివి. మరికొన్ని సాధారణపౌరులవి. వారిరొమ్ములు తొలచియున్నాయి. వారిచేతులు నరుకబడ్డాయి. వారికాళ్లు తీవ్రంగా గాయపడ్డాయి.........

"మరల మరోగుంపు మా మార్గాన్ని నిరోధించారు... మాలో, చనిపోయినవారికివలె నటిస్తూ రోడ్డుమీద వెల్లకిలా పడుకోవాలనే గుసగుస బయలుదేరింది. ఆవిధంగాచేయబట్టే మమ్ములను వారు వదలేశారు. నాగార్డులు నేను శోషిల్లుతానని శవాలవంక చూడవద్దని సలహాయిచ్చారు........."

తరువాత మరల వారు తాత్కాలికంగా ఒకయింటిలో రక్షణతీసికొంటే కొత్తగా కాల్పులు మరల సాగాయి. నా గార్డుల్లో ఒకరు చనిపోయారు........

"నేను ఒక పల్లెటూరిపడుచు వేషం ధరించి నకగార్డు చిల్లర వస్తువులమ్మేవాని వేషంలో ఆయింటినుండిబయలుదేరాం. నేను దారిలో నకతట్ట, కూరగాయలు సంపాదించి నెత్తిన పెట్టాను.....యుద్ధనావలనుండి ఫిరంగికాల్పులధ్వని వినగానే కలిగిన మాసంతోషం పట్టరానిది. డాక్టరుసర్ సురక్షితంగా వున్నాడన్నమాట.

"మరునాడుదయం ఆపల్లెటూరుపడుచు వేషంలోనే షామీర్‌కు చేరుకోగా, అక్కడనుండి ఒకస్నేహితుడు, ఫౌండ్రి కార్మికుడు, ఒకచిన్న పడవను ఏర్పాటుచేయగా లినార్‌లో ఒకయింటికి చేరుకున్నాం. జీవన్మరణపోరాటం తరువాత ఎలాగైతేనేం, ఆరాత్రికి ఓడపై డాక్టరుసన్‌ను కలుసుకొనగలిగాను."

---

"అల్లది అరుణదిఙ్మండలం—బంగరు కాంతులవి,
స్వాతంత్ర్య పిలుపదే గానమ్ములో."

—లైహాంగ్‌షాన్ గెరిల్లాగానం.

# ఆ శా ది న ము లు



మంచూపరిపాలన అంతమొందిన తరువాత స్త్రీల విముక్తి ఉద్యమం ఉరవడి నందుకొంది. 1909లో ప్రప్రథమంగా స్త్రీలకు ప్రత్యేకంగా ప్రాథమికపాఠశాలలు స్థాపించబడ్డాయి. 1919లో ప్రథమస్త్రీల కళాశాల స్థాపించబడింది. మధ్యతరగతి స్త్రీలే ఎక్కువమంది స్కూళ్లకు, కాలేజీలకు పంపబడ్డారు.

1917లో రష్యన్‌విప్లవం. విముక్తికొరకు పోరాడే పీడిత ప్రజాసామాన్యంపై దాని ప్రభావంపడింది. రోజుకు 16, 17 గంటలు మురికివీధుల్లో ఊడిగంచేసే చైనాకూలీలు, షాంఘై కార్మికులు మేల్కొన్నారు. చల్లని స్వాతంత్ర్యవాయువులు వారిని తాకాయి. ఫ్యాక్టరీల్లోను, పొలాల్లోను కష్టించేస్త్రీలు, పురుషులు వంగిననడుములను ఎత్తారు. తమ పిడికిళ్లను బిగించి, దూరదృష్టిసారించి, నూతనజీవిత స్వప్నాలను గన్నారు. ఈ

దినాలు ఆశతో నిండారినరోజులు. ప్రజలు కదలుతున్నారు. చైనాఅంతా వాస్తవిక స్వాతంత్ర్య మధురస్వప్నాలతో మత్తెక్కిపోయింది.

1905, 1917 రెండువిప్లవాలూ దౌర్జన్య హింసాకాండను వ్యతిరేకంగా తమ విముక్తికొరకు మరింత ఉధృతంగా ప్రయత్నాలు కొనసాగించుటకు చైనాయువకుల నుత్తేజపరిచాయి. 1917 విప్లవం సైద్ధాంతిక ప్రభావమేకాకుండా ఆచరణలోనే మహత్తరప్రభావం కలుగజేసింది. 1911 నుండి 1923 వరకు చైనావిప్లవం దేశంఅంతటా ఆధిపత్యంవహించుటకే తీవ్ర కృషిచేసింది కాని విదేశసామ్రాజ్యవాదులు సన్‌యట్‌సేన్‌చే నడపబడే నవీన ప్రజాతంత్ర శక్తులకు వ్యతిరేకంగా చైనాలోని అభివృద్ధి నిరోధక శక్తులకు సహాయపడటంతో చైనావిప్లవం నిలద్రొక్కుకొనలేకపోయింది. సామ్రాజ్యవాదులకు కొల్లలుగా ఉన్నధనం, ఆయుధాలే వారికి తరుగైనాయి.

1923 తరువాత రష్యా, విప్లవశక్తులకు ప్రత్యక్ష సహాయంచేసింది. నూతనసోవియట్ ప్రభుత్వం చైనాలో తనకుగల హక్కులనన్నిటినీ (సోషలిజంయొక్క సామ్రాజ్య వ్యతిరేక సూత్రాలపరికారం తదితర వలసదేశాలలోగూడ) వదులుకొన్నది. 1923లో రష్యన్లు సన్‌యట్‌సేన్‌తో ఆయన దేశాన్ని సుస్థిరంగావించి, ఐక్యపరచేటందుకు అవసరమైనటువంటి ధనం, ఆయుధాలు, మిలిటరీ, రాజకీయ సలహాదారులను సప్లయిచేస్తామని ఒడంబడిక నేర్పాటుచేసికొన్నారు. ఆ ఒడంబడిక ఆయనకు సైన్యాన్ని చేకూర్చింది. అప్పటినుండీ చైనావిప్లవం బలంలోను, పలుకుబడిలోను వృద్ధిగాంచింది.

దీనితరువాత రెండుసంవత్సరాలకు 'విప్లవపితరుడు', జాతీయత, ప్రజాస్వామ్యం, ప్రజల బ్రతుకుదెరువు అనే యీ మూడు సూత్రాలను, తనకార్యక్రమాన్ని కొనసాగించుటకు తన కొమింటాంగ్ పార్టీనివదలి మరణించెను. తనమరణ శయ్యపై సోవియట్ ప్రభుత్వానికి ఆయనొక జాబువ్రాశారు. ఆజాబు, సన్ యట్ సేన్ చైనాకు, సోవియట్ రష్యాకుగల సన్నిహితబంధనాలను వివరించుతుంది. అందులోని ఒక అభిప్రాయాన్నిమాత్రం, మదాంసన్ ఎల్లప్పుడూ స్మరించుతుంది. "నేను ఒకపార్టీని, చైనాకు సంపూర్ణవిముక్తిని సాధించడం, తదితర బానిసదేశాలను సామ్రాజ్యవిధానంనుండి విముక్తి గావించే మహత్తర చారిత్రాత్మక కర్తవ్యంలో నిర్వహణలో ఎల్లప్పుడూ మీతో (సోవియట్ ప్రభుత్వం) సన్నిహిత సంబంధాలను నెరపుతుందని నేనాశించే పార్టీని విడిచిపుచ్చుతున్నా. నేను ఆపార్టీని మీతో ఎల్లప్పుడూ అవిరామంగా సన్నిహిత సంబంధాలు నెరపవలసినదిగా ఆదేశించుతున్నా."

మదాంసన్ తన మృతభర్తయొక్క అంతిమ ఆదేశాలను సంరక్షించుటకై ఎన్నోకష్టాలు సహించవలసివచ్చింది. తరువాత కొమింటాంగ్‌ను వారసత్వంపుచ్చుకొన్న జంగ్-కై-షేక్ సోషలిష్టు రష్యాకు, ప్రజాస్వామ్య ఆశయాలకు దూరమగుతున్నకొలదీ సోషలిష్టు రష్యాతో ఆమె మరింత ముడివడింది.

తనభర్త చనిపోయినతరువాత సూంగ్ చింగ్ అంగ్ కష్టభూయిష్టమైనటువంటి, వీరోచితమైనటువంటి పాత్రను నిర్వహించింది. సహజస్వభావంగా, ఆమె చాల పిరికి. చాల భిడి

యిపడే స్వభావం. పబ్లిసిటీఅంటే ద్వేషిస్తుంది. బహిరంగ ఉపన్యాసాలు చేయాలంటే ఆమెకు పెద్దబాధ. బహుశా ఆమె ఎప్పుడూ ఆవిషయంలో విజయంపొందియుండదు. ఏ బహిరంగోపన్యాసం జరిగిన తరువాతనైనా ఆమె ప్రతిసారి జబ్బుపడుతుంది. ఎవరియెదుటనైనా మాట్లాడవలసివస్తే, ప్రశాంతంగా ఉండగలందులకు ఆమె ప్రయత్నాలలో చేతిరుమాళ్లను పీలికలుగా చించడం ఒక అలవాటు. అయినప్పటికీ ఆమె కేంద్రకార్యనిర్వాహకవర్గంలోను, కొమింటాంగ్‌లోను తదితర కమిటీల్లోను స్థానంపొందింది.

1927లో, సన్‌యట్‌సేన్ యొక్క యంగ్‌లెఫ్టినెంట్ అయిన జంగ్‌కైషేక్ నడిపిన కాంటినీస్‌సైన్యాలు రష్యన్ ఆయుధాలు, ధనసహాయాలతో పురోగమించి చైనాఅంతటా ఘనవిజయాలను సాధించాయి. వారి పురోగమనయాత్రలో వారు హాంకౌ, షాంఘై, నాంకింగ్‌లను పట్టుకొన్నారు.

ఇది ఛింగ్‌అంగ్‌కు అత్యంత క్లిష్టదశ. కొమింటాంగ్‌లో విభేదాలు పొడసూపాయి. విదేశసామ్రాజ్యవాదుల మద్దతుగల భూస్వాములు, ఆర్మీఆఫీసర్లు, నడిపే మితవాదగ్రూపుకు ఇప్పుడు జంగ్‌కైషేక్ యొక్క సంపూర్ణ సహకారముంది. జంగ్‌ను గద్దెనెక్కించిన షాంఘైకార్మికులు, యాంగ్ట్సీ లోయ రైతులు వామపక్షానికి ప్రధానశక్తులుగా తయారయ్యాయి. మితవాదగ్రూపు డాక్టరు సన్‌యట్‌సన్, జాతీయవిప్లవం సృష్టించిన కార్మికసంస్థల మొక్కవోని శక్తి తమ వర్గప్రయోజనాలకు ప్రాణకంటకంగా అభిప్రాయపడ్డారు. కాబట్టి వారు విప్లవం సాధించిన 'స్వాతంత్ర్యాన్ని' తమవ్యాఖ్యానంతో దౌర్జన్యంగా

కొప్పపలచుకున్నారు. "జీవితచరిత్ర" అనే తనపుస్తకంలో ఒక స్త్రీ రచయిత "పీపింగ్ యంగ్" యిలాగ వ్రాసింది., "వేలాది కార్మికులు, కర్షకులుయొక్క అనంత, మహత్తర త్యాగాల ఫలితంగా సాధించిన విప్లవం స్థానంలో జంగ్-కై-షేక్ నాయకత్వాన ఒక బలవత్తరమైన నిర్బంధమిలటరీ నిరంకుశత్వం ప్రవేశించింది. ఈ నిరంకుశత్వపు ప్రధానశక్తులన్నీ కార్మికసంస్థలపై నడిపింపబడుతున్నాయి."

మదాంసన్ తన విధానాన్ని ఎంచుకొనవలసియుంది. తనవర్గానికే తాను కట్టుబడియుండి నిరంకుశశక్తుల్ని బలపర్చడం ద్వారా డాక్టరుసన్ సూత్రాలనే కాలదన్నిన జంగ్ కై షేక్‌ను బలపరచటమా? లేక డాక్టరు సన్‌యట్‌సేన్ సూత్రాలనే అంటిపెట్టుకొనియుండి, తనజీవితంలో అంతర్భాగమైన న్యాయ సూత్రాలకు కట్టుబడియుండడమా? మొదటి విధానం ఆమె భవిష్యత్తును భద్రపరుస్తుంది. రెండవది, గౌరవాన్ని ఉద్దీపింపజేస్తుంది. మదాంసన్ హృదయంలో బహుశా ఎప్పుడూ అలాంటి లొంగుబాటు తత్వం ప్రవేశించియుండదు. బీదల కొరకు తుపాకిగుండ్లను ఎదుర్కొన్నవారికి కర్తవ్యమార్గం సూటియైనటువంటిది. ఖచ్చితమైనటువంటిది. ఆమె తన జీవితాన్ని, తన మానసిక సంపదలను పీడితులసేవకే అర్పించింది. హాంకౌ కేంద్రంగా ఆమె వామపక్షానికి నాయకురాలైంది. విప్లవశక్తుల్లో మరొకభాగం నాకింగ్‌లో స్థాపించబడింది.

---

"స్వేచ్ఛాన్వేషకుబాట అతికష్ట భూయిష్ఠం,
స్వర్గానికి బాటకంటె కఠినతరమే......
పాపం ! ఆదారిన పయనించే దూరపుబాటసారులు,
ఆ ప్రయాణానికెందు కాయత్తమైరి ?......
ఓ ! (ప్యాసు) ఉన్నమానవుడు పరమద్రోహి,
నక్కలైన తోడేలులైన మార్చుతారు !
ఉదయాన పులిఅంటె వణకిపోదుము
సాయం సమయాన సర్పానికి వెరుస్తాం,
రక్తాన్ని పిసిరిపీల్చే దంతాలు,
గంజాయిలా మానవుల్ని పీక్కుతింటూ......
స్వేచ్ఛాన్వేషకు బాట అతికష్ట భూయిష్ఠం,
స్వర్గానికి బాటకంటె కఠినతరమే."

—లీపో (టాంగ్ డైనాస్టీ)

# విప్లవ ప్రతిఘాతం



ఈ నిర్ణయం లేక జీవితవిధానం ఛింగ్ అంగ్ యే కాకుండా విద్యార్థి సంస్థల్లోను, ట్రేడ్ యూనియన్‌లలోను ఉన్న వేలాది స్త్రీలు నిర్ణయించుకొనవలసిన విషయం. వారు ఏ పక్షం వహించబోతున్నారు ?" వారి న్యాయచింతన బలవత్తరమైనట్టిది. వారి రాజకీయ పరిజ్ఞానం అంత అగాధ

మైనది. మెజారిటీ స్త్రీలు వామపక్షానికే తమ సానుభూతిని తెలియపరచారు. షాంఘైలో గొప్పసమ్మెను ప్రదర్శించడంతో వారు వామపక్షం యెడ వారికిగల ఉత్సాహాన్ని తెలియబరిచారు. ఒక మిల్లులో 800 స్త్రీలను డిస్మిస్ చేసినదానికి నిరసనగా సిల్కుమిల్లుల్లో పని చేసే 9500 మంది స్త్రీ కార్మికులు సమ్మెచేశారు. షాంఘై, నాంకింగ్, హాంకౌ, కేంటన్ మొదలగు తదితర పారిశ్రామిక కేంద్రాలలో వచ్చిన సమ్మెల వెల్లువ కొమింటాంగ్ అధికారులలో మితవాదపక్షాన్ని అరాజకంలో ముంచెత్తింది. ఈ పట్టణాలలోగల యూనియన్లలో 325000 మంది స్త్రీలు సభ్యులుగావున్నారు. 1920లో చైనాకమ్యూనిస్టుపార్టీని స్థాపించినవారిలో షెంగ్‌చేన్ యే ఒక స్త్రీ, ప్రముఖ వ్యక్తి.

జంగ్‌కై షేక్ మితవాదుల పక్షాన ప్రారంభించిన రక్తదాహ నిర్బంధచర్యలలో అత్యంత భయంకరమైన ఘటనలు జరిగాయి. నాజీలు తమ ఖైదీలయెడ జరిపిన దారుణాలతో పోల్చినపుడు యీ ఫాసిస్టుయుద్ధం చాల సర్వసామాన్యంగా కనిపించాయి. కాని సన్ యట్‌సేన్ లెఫ్టినెంటు యిలాంటి దారుణచర్యలు జరపడం నమ్మశక్యంకానటువంటివి. కార్మిక తిరుగుబాటు రక్తప్రవాహంలో అణచబడింది. పురుషులు, స్త్రీలు, విద్యార్థులు, కార్మికులు దారుణంగా హింసించబడ్డారు. లేదా మంటల్లో సజీవులుగా కాల్చబడ్డారు. (చూడండి, "షాంఘైలో తుపాను, By ఆంద్రేమాల్‌రాక్స్.) వేలాదిప్రజలు చిత్రహింసగావింపబడ్డారు......"రెడ్స్"తో (కమ్యూనిస్టులతో) సానుభూతికలిగియున్నారని అనుమానముంటేచాలు. పశువులను

చంపినట్లు చంపేవారు. డాక్టరుసన్ భార్యకూడ సురక్షితంగానివసించలేకపోయింది. ఆమెఆమెభద్రతకోరకుపారిపోవలసివచ్చింది. సన్ యొక్క జాతీయోద్యమములు వేలాదిగా పాల్గొన్న స్త్రీ విద్యార్థులును, రైతుస్త్రీలు ఆర్మిలోగాని, రెడ్ క్రాస్‌లోగానిచేరగానే తమ జుత్తును కత్తిరించుకొన్నారు. అలా జుత్తుకత్తిరించుకున్న స్త్రీలనందరినీ చూడటంతోనే "రెడ్స్"కు సానుభూతి కలిగియుంటారనే అభిప్రాయంతో వారినందరినీ కాల్చివేయవలసినదిగా ఆర్డర్లు జారీచేశారు. విప్లవప్రతీఘాతంప్రారంభమైంది.

"ఓ ! ప్యాసుఉన్న మానవుడు పరమద్రోహి
నక్క-నైన, తోడేలునైన మార్చుతారు !"........

ఆ 'ఆటోబయాగ్రఫీ' రచయిత పేపింగ్ యింగ్ విప్లవప్రతీఘాతం ఉచ్ఛశిఖరాన్ని అందుకున్న గడ్డురోజుల వివరాలను స్పష్టంగా వివరించింది. ఆమె గ్రంథం 25 సంవత్సరాల చిహ్నం, సారాంశం. ఆమెపోరాటమే వేలాది చైనా స్త్రీల పోరాటం. ఆమె 3 సంవత్సరాల వయస్సునుండి తిరుగుబాటు తత్త్వంకలది. స్వతంత్రభావాలుగలది. తనను క్రుంగదీసిన పురాతనఆచారానికి వ్యతిరేకంగా ఆమె ధీరోచితంగా పోరాడింది. ఆమె గ్రంథం నుండి ఎంచిన ఆమె యీ క్రిందిగాధ సర్వసాధారణంగా చైనా స్త్రీలు అనుభవించే జీవితసారాంశమే. "ఆమె ఒక స్త్రీ. గొప్ప కాలప్రవాహంలో ఉద్భవించింది. ఇంట్లో తన తల్లి దౌర్జన్యాలకు వ్యతిరేకంగా పోరింది. రంగంలో యుద్ధప్రభువుల నెదిరించి పోరింది." ఇది ఆమె మహత్తరగాధ.

# బాల్యం



నా తల్లి మొండిపట్టు స్వభావంగలది.........ఇంటిలో గయ్యాళి. ఆమె సంతతిఅంతా ఆమెకుబానిసలు. ఆమె సలహాల ప్రకారం మాత్రమే నడచుకోవాలి. ఒకసారి మా పెద్దన్నయ్య ఆమె అనుమతిలేకుండానే పట్టణంలో కాపురంపెట్టాడు. వెంటనే ఆమె వారిని వెనక్కిరమ్మని ఆజ్ఞలు జారీచేసింది. అంతేగాక, అందుకుగాను మా పెద్దన్నయ్యకు శిక్షవిధించి, అన్నయ్యను మోకాళ్ళపై కూర్చుండబెట్టి నెత్తిమీద నీళ్ళగిన్నె (బేసిన్) పెట్టింది. మా అన్నయ్య ఏమాత్రమైనా కదలి నీళ్లు చిలికితే మా అమ్మ అతని అలక్ష్యానికి అతన్ని బాదేది...... మా రెండో అన్నయ్య పాదాలను కట్టివేసికొన్నామెను. ఒక భయంకర స్త్రీని పెండ్లిచేసికొన్నాడు. వారు వకరి నొకరు ప్రేమించుకొనలేదు. అందుచేత మా అన్నయ్య ఆమెకు విడాకు లివ్వగోరితే మా అమ్మ బల్లగుద్దుతూ గర్జించింది. "ఓరి పశువా! మన పురాణాలన్నీ చదివి నేర్చుకున్నదంతా యిలాంటి అవమానకర, అపవిత్రమైన సలహా లివ్వడానికేనా! నీ వేమైనా పూర్వులకీర్తి నిలుపదలచుకున్నావా, లేదా ? నీవు విడాకులు కావాలనుకుంటే ముందునన్నుచంపి మాట్లాడు." ఇక మా అన్నయ్య అలాగే కుములుతూ చివరికి రక్తంకక్కి చనిపోయాడు.

"ఇక మా అక్కకు ఎలుకకున్నంత పిరికి. మా మూడవ అన్నయ్యకూడ విధేయుడుగానే వుంటాడు. అయినా తనవ్యవహారాలను ఎలాగో నిర్వహించుకోగలడు. ఇక నేను,—చెప్పుకోవడానికి భిడియపడుతున్న—తిరుగుబాటు స్వభావంగలదాన్ని ........."వసంతర్తువురాగానే మాగ్రామంలో పొలాలన్నీ పచ్చగా కళకళలాడుతున్నాయి. తెలుపు, ఎరుపు పుష్పాలు ప్రతిచోట వికసించాయి......చూడు, చేపలుపట్టేపిల్లలతో నీవు కలుస్తావెందుకు......నేను అచ్చంగా మగపిల్లల మాదిరిగా, చెప్పులుతీసి వర్షంలో గిరాటువేస్తాను. జలగకాటుకు ఎప్పుడైనా నేను ఏడ్చుకుంటూ యింటికిజేరితే మాఅమ్మ నన్ను గట్టిగా చీవాట్లుపెట్టేది.........కొంటెపిల్లా!"—"ఆడపిల్లలు మాత్రం బయటికివెళ్లి ఎందుకు ఆడుకోగూడదు?"—"వెళ్లకూడదు. అంతే. ఆడపిల్లలు యింట్లోనే కూర్చోవాలి"...... వెంటనే గట్టిదెబ్బలు తగిలేవి.!!

"నేను కొంటెపిల్లను గనుక ప్రతిరోజూ మధ్యాహ్నం భోజనం అయినతరువాత తేయాకుతోటలో ఆకులుకోయుటకు పరుగెత్తేదాన్ని......ఎక్కువమంది తేయాకు కోయుపిల్లల్ని "బుల్లికోడళ్లు" అని పిలిచేవారం. వారిజీవితం దుఃఖపూరితం. ప్రతిరోజూ వారు 40, 50 "కాటీల తేయాకు కోయాలి. వారి జీతాలుమాత్రం 10, 12 కోపర్లు ఉంటుంది. అదిఅయినా వారిఅత్తలకు సమర్పించుకోవాలి. వారికి సరియైన తిండియైనా చాల అరుదుగా దొరికేదేమో!......వారు అస్థిపంజరాల్లాగా సన్నగా ఉండేవారు. తేయాకుతోటలో ప్రవేశించినప్పటినుండి ఒకరికొకరు తమ విషాదగాథలను, అత్తలుపెట్టే కష్టాలను విప

ఉరుముకొనేవారు. వారికన్నీరు తేయాకులపై బిందువులుగా పడి ప్రొద్దుటిపూట మంచుబిందువుల్లాగా మెరసేవి.

ఒంటినిండా గాయాలున్న ఒకఅమ్మాయిని, "ఇన్ని కష్టాలుంటే నీవెందుకు పారిపోవూ?" అని నేను అడిగాను. ఆమెపేరు స్ప్రింగ్‌ఫ్రాగ్రెన్సు—"పారిపోవడమే! ఎలాసాహసించడం? మాఅమ్మ నాకుపెండ్లిచేసి అత్తవారింటికి పంపివేసింది. ఆమె చేతుల్లోనే, ఆమెయింటిలోనే చనిపోవాలి......"ఆమె దురదృష్టానికి నేను కన్నీరుకార్చాను...... టాలెంటెడ్‌ఫ్లవర్ అనుపేరుగల మరో అమ్మాయి ఆమెను యిలా ఓదార్చింది. "అయ్యో! నాగీత అంతకన్నా కనాకష్టం. నాజీవితం ఎద్దు, గుర్రం బ్రతుకుకంటె హేయమైనట్టిది. ఈజన్మలో నేను యింత కష్టపడితే వచ్చేజన్మలో నేను సుఖపడతానని ఆశిస్తున్నా."

---

# నా ప్రథమ విషాదఘటన



"నేను పెద్దదాన్ని అవుతున్నాననీ, నాపాదాలు యింకా బంధించకుండానే వున్నాయనీ, యిలావుంటే నాకు రాబోయే అత్తగారు నన్ను స్వీకరించరని చెప్పారు.

"నాబంగారమే, నేను యీరోజు నీపాదాలను బిగించబోతున్నా. నీవుపోయి ఆదేవత యెదుట మోకరిల్లి నీకు చిన్న పాదాలను దయచేయుమని ప్రార్థించు."

"నాపాదాలను బిగించడం నాకు యిష్టంలేదు."— అయ్యో! అన్నీ జాగ్రత్తగా సిద్ధపరచబడ్డాయి. రేగుపుష్పాలను ఎంబ్రాయిడరీ అల్లిన చిన్నచెప్పులజత, 3 అంగుళాల వెడల్పుగల రెండు పొడవైన గుడ్డపీలికలు నా ముందుంచబడ్డాయి. వాటినిచూడగానే నాకు భయంవేసింది.

"అమ్మా, ఇదిచాలానొప్పి పుడుతుందమ్మా. నేను నడవలేను. నాకుమాత్రం యిది కట్టబోకమ్మా!"......నేను విపరీతమైన భయంతో, కన్నీళ్లతో ప్రార్థించాను.

"నీవంటే నాకు ప్రేమగాబట్టి నేను నీపాదాలను బిగించుతాను. నేను అలాచేయకపోతే నీయెడ నాకర్తవ్యాన్ని నిర్వహించడం లేదన్నమాట. పెద్దపాదాలున్న అమ్మాయిలకు భర్తలులభ్యంకారన్నవిషయం గుర్తుంచుకో"..."అమ్మా! నేను యీబాధతో చచ్చిపోతున్నానమ్మా, ఇలా పాదాలు సంకు

చీటి పరిచేకంటే జీవితపర్యంతం పెండ్లిచేసుకోకుండానైనా ఉం టానమ్మా!"

అప్పటినుండి నాకాలమంతా మంటవేయడంతోనే సరి పుచ్చేదాన్ని. నీపాదాలకు సంకెళ్లుతగిలించినట్లయింది. నడవ డం దుర్లభం. సుందర పుష్పాలను అనుభవించడం, చేపల్ని, రొయ్యల్ని పట్టేరోజులు పోయాయి. ఇకఅలాంటిరోజులు నాకు తిరిగిరావు.

మాఅమ్మ నేను మాఅక్కలాగానే ఎంబ్రాయిడరీ పనులు చేస్తానని ఆశించింది.

"నాకివన్నీ అక్కర్లేదు. నాకు కావలసిందల్లా చదువు."

"అమ్మయ్యో! ఆడపిల్ల చదువుకోవడమా? స్వర్గం ఊడి పడదూ! భూమి బ్రద్దలైపోదూ! చదవడం నీఅన్నయ్యల పని. నీవుపుట్టింది యింటివరకుమాత్రం కట్టుబడియుంటానికే. చదువు కొన్న స్త్రీలవలన ఉపయోగమేమిటో ఆలోచించిచూడు..."

"చివరకు నేను బడికిపోవుటకు అనుమతించబడింది."

ప్రైమరీస్కూలులో చదువు పూర్తిచేసిన తరువాత యింకా కొనసాగించవలెనని కుతూహలపడింది.

"గరల్స్‌స్కూలుకు వెళ్లమని పెద్దన్నయ్యవ్రాయలేదూ?"

"వాడికికేంతెలుసు? వచ్చేసంవత్సరంనుండి నీవు ఎంబ్రా యిడరీ పని ప్రారంభించాలి. నేను నీపాదాలను మరింత చిన్న విగా బిగించుతాను."

"కాని అమ్మా! అన్నయ్యలు చదువుకొన్నట్లుగానే యింకా చదువుకుంటాను. అన్నయ్యల్లాగా చదువుకోనియ్యవా అమ్మా? నేను వారిమాదిరిగా మనిషినికానూ?"

"నాన్సెన్స్! నీకేంతెలుసు మనుష్యులసంగతి? నీవు ఆడపిల్లవు. కర్మచారిణి భార్యవుగా, సుమాతగా మాత్రమే తయారుకావాలి. నీవు చదువుకోవలసిన అవసరం యేం వచ్చింది?......ఆసమయంలో నేనెందుకు చదువుకోవాలో చెప్పలేకపోయాను. స్త్రీపురుషుల సమానత్వాన్నిగూర్చిగూడ నేను మాఅమ్మతో వాదించలేకపోయాను. స్త్రీలు చదువుకొన్నతరువాత ప్రపంచంలో ఎంతో మంచిచేయగలరని నేను అసలు చెప్పలేకపోయాను. నేను చదువుకోవాలని అభిలషిస్తున్నాను ఆనేదే నాకు అప్పుడు తెలిసింది. నూతనవిజ్ఞానాన్ని సంపాదించాలనుకొన్నాను. స్త్రీలు భార్యలుగామాత్రమే తయారుగావడానికి, తమభర్తలకు పిల్లల్ని కనిపెట్టటానికి, మాఅక్క మాదిరిగా అత్తమామలచే హీనంగా చూడబడటానికి కారణమేమిటో నాకు బోధపడలేదు......నాకిక ఏఆశా కానరాక ఆత్మహత్య చేసికో నిశ్చయించుకున్నాను......నాప్రక్కపై పరుండి ఆకలికి మాడి చావాలని అనుకున్నా. మాఅక్క నన్ను ఓదార్చడానికి మాటిమాటికీ నాదగ్గరకు వచ్చేది. "నాచిట్టి చెల్లివిగదూ! నీకేమిటమ్మా కష్టం? నేను చేయగలిగిందేమన్నా వుంటే నేను తప్పకుండా సహాయపడతాను."

"నాకొరకు ఎవరూ ఏమీచేయలేరు."......కన్నీరు బొటబొటాకారాయి. "నేను—నేను చదువు కొనసాగించాలని అనుకొంటున్నా." నేను యీమాటలు అనేసరికి మాఅక్క గూడ ఏడ్చింది......మాఅమ్మ, నేను నిజంగా చనిపోతానవనే భయంతో లొంగిపోయింది—

# సైనిక జీవితం



నా జీవితపర్యంతం నేను మా రెండవఅన్నయ్యకు కృతజ్ఞురాలను. పూర్తిగా ఆయనమూలకంగానే నేను ఆర్మీలో చేరగలిగాను. ఆయన నా కిలా చెప్పాడు.

"అమ్మాయి ! ఎటువంటి దౌర్భాగ్యపు దానివి నీవు. కాలం గంటకొట్టింది. అయినా యింకానీవు నీ స్వప్నంలో గుర్రుపెడుతున్నావు. సుందరకుమారుల, సుందర స్త్రీల కథలను నీవు ఎప్పుడో కట్టిపెట్టియుంటావు. నీవు ఒకజాగృత స్త్రీవి. నీకు క్రొత్తసాహిత్యమంటే యిష్టం. విప్లవ గ్రంథాలను ఎందుకు చదవగూడదూ !"—నాకు వెంటనే ఆగ్రంథాలయెడ అభిరుచి కలిగింది. దేశంలోని శ్రామికప్రజల జీవితాన్ని జూచినప్పుడు నేనువారి జీవితాన్ని, కష్టాల్ని వర్ణించ మొదలుపెట్టాను...... మిలిటరీస్కూలుకు విద్యార్థినిగా దరఖాస్తు పెట్టాను.

మా రెండో అన్నయ్యచెప్పాడు, "నీవు స్వేచ్ఛ పొందాలంటే యిదొక్కటేమార్గం. విప్లవంలో పాల్గొంటే వివాహం, భవిష్యత్తులాంటి సమస్యలు తీరిపోతాయి." ఆర్మీలో చేరదలచుకొన్న స్త్రీవిద్యార్థులంతా నిత్యం పీడించే తమ కుటుంబాలనుండి విముక్తిపొందేటందుకే చేరారని నేనునమ్ముతున్నా. యూనిఫారంధరించింది, [illegible]

నిస్స్వార్థంగా తయారవుతాయి. ఆసమయంలో ఆమె భాధ్యత భుజానవేసికొన్న 15,00,00,000 పీడిత ప్రజలను గురించి ఆలోచించుతుంది.... తమ్ముతీసికొనిపోయే రైలుకోసం ఎదురు చూస్తున్న 250 మంది వీర స్త్రీపురుషులింకా జ్ఞాపకమున్నారు. మేం 50 మంది స్త్రీసైనికులం ఒకేపెట్టెలో కూర్చున్నాం. విషాదంలో మునిగియున్న మేమంతా పాడటం ఆరంభించాం. "లేవండి ఓ తాడితులారా, గాఢనిద్రలనుండి మేల్కొనండి !"— పాడటం ఆరంభించగానే మేమంతా ఎంతో ఆనందకరంగా ఉల్లాసపడ్డాం. మా నూతన జీవిత ప్రారంభానికి, మాదివ్యభవిష్యత్తుకు మాకు మేమే ధన్యవాదాలర్పించుకొన్నాం. ప్రతి ఒక్కరమూ మత్తెక్కిపోయాం- పాడుతూ.........

---

## మిలిటరీస్కూలు



"ఇక్కడికి మీరు రావడమంటే సున్నిత నారీమణులుగా గుర్తించబడే స్కూళ్ళలో చేరటానికిగాదని మీరు ప్రప్రధమంగా గుర్తించాలి. ఇప్పుడు మీరు సైనికులు. ఈరోజునుండి సైనిక కర్తవ్యాలను, నిర్ణయాలుగా [illegible], [illegible]

నేర్చుకోవాలి. ఈ మాటలు వినగానే మేమంతా ఉద్రిక్తుల మయ్యాం, ఉత్సాహపడ్డాం. నిజంగానే ఆరోజు నుండి మా అంతట మేమే సైనికులుగా భావించుకుంటున్నాం.

పోరాటంపాట పాడటం నేర్చుకొన్నప్పటినుండీ మాలో ప్రతిఒక్కరం ఎల్లవేళలూ సమిష్టిగానం పాడుతూనేవుండేవాళ్ళం

"ప్రజల అగ్రగామిగా త్వరితంగా తయారుకండి,
పురాతనకాలానికి స్వస్తిచెప్పేందుకు, ప్రేమనశించుగాక,
సోషలిస్టు విప్లవాన్ని సాధించండి, ఓగొప్ప స్త్రీలారా !

"ప్రతిసారి మేం ప్రేమనశించుగాక" అనేపదం పాడేటప్పుడు ఇంకాఎక్కువ జోరుగా ప్రత్యేకంగా పాడేవాళ్ళం. ఎందుకంటే యీ పాటసమయాల్లో మాస్నేహితుల కందరకూ ప్రేమాలోచనకు తావివ్వరాదని వార్నింగుగా పాడేవాళ్ళం. అయినప్పటికీ కొంతమంది స్త్రీ పురుష కామ్రేడ్స్ ఒకరి నొకరు ప్రేమించుకున్నవారున్నారు. కాని వారిముందు వొక సూత్రముండుంది. ప్రతివొక్కరూ తాము ప్రేమించేవారు ఒకే యుద్ధరంగములో ఉన్నారా లేరాయని ప్రశ్నించుకోవాలి. క్లుప్తంగా చెప్పాలంటే వారిప్రేమ విప్లవయుత ప్రేమగాఉండాలి. వారి అత్యంత అవసరమైన ప్రధానవిషయం ఇది.— విప్లవం. విప్లవంమీదనే వారు తమ భవిష్యత్తును, ఆనందాన్ని నిలుపు కొన్నారు. పూర్వాచారాలు, పురాతనపద్ధతి రూపుమాపుచేయనిదే స్త్రీజాతి స్వేచ్ఛ నందజాలదని వారు గుర్తించారు. సమాజంలో అందరూ అనుభవించగల హాయిని, సౌఖ్యాన్ని చేకూర్చడమే మానవజాతి లక్ష్యం.

# సంసిద్ధత

(యుద్ధరంగానికి)



"రిపోర్టు. నేను దండయాత్రలో పాల్గొనదలచుకున్నా."

"రిపోర్టు. నేను ఉత్తరదేశపు నివాసిని. ఉత్తరదేశస్థులలో వార్తాప్రచారానికి ప్రత్యేకంగా ఉపయోగ పడతాను."

"రిపోర్టు. నేను చాల బలిష్ఠుడను. యుద్ధరంగానికి వెళ్లడానికి ఉత్సాహపడుతున్నా.!"......

లెఫ్టినెంటు రూం తేనెతుట్టెలాగా తీరిక లేకుండావుండేది. ......మా రెండో అన్నయ్య నన్ను చూడటానికి వచ్చాడు.

"గతరాత్రి నీజాబు అందింది. అది ఎంతవీరోచితంగా వ్రాయబడిందంటే వెంటనే దానిని పత్రికల్లో ప్రకటించడానికి పంపించాను."

అతనిస్వరం గద్గదికమైంది. కన్నీరు ఎంతో దూరంలో లేదు. కన్నీరొలికించడం అంటువ్యాధిగనుక నేను భయపడి నాకళ్లను ఒక నినాదాల పోష్టరుపైకి మరలించాను. "విప్లవకారులు కన్నీరుకాదు ఒలికించవలసింది, రక్తం చిందించాలి." ఉదయం 5 గంటలకు మేమంతా సంసిద్ధులమయ్యాం. బయట పెద్ద నదీప్రవాహంలావుంది......ఈలలు, నవ్వులు, ఏడ్పులు రకరకాలధ్వనులు. గట్టిగా అరుస్తున్నారు. "పదండిముందుకు!"

—"శత్రునాశనంచేసి విజయులై తిరిగిరండి!"......గుంపులో నుండి పెద్దకేక వినబడింది. "శత్రువును సర్వనాశనం గావించండి, విజయంపొంది మరలండి!" మేంగూడ వారికి సమాధాన నినాదాలు పలికాం. ఇలాంటి ఉద్రేకం, ఉత్సాహం తోనే మేం రంగానికి బయలుదేరాం......

---

# సైన్యంనుండి బయటికి



మేం యుద్ధరంగంనుండి తిరిగిరాగానే ఒకరాత్రి అకస్మాత్తుగా ఈల వినబడింది. లెఫ్టినెంటు ప్రారంభించాడు.

"మీ రెవరూ కించపడవద్దని ప్రార్థిస్తున్నా. విప్లవకారులైనవారు తిరోగమనాలకుకూడ తయారుకావలసివుంది. అవి సర్వసాధారణమే. నిరుత్సాహపడవలసిన పనిలేదు. అభివృద్ధి నిరోధకసైన్యాలు బలంగా వున్నాయిగనుక, మన విప్లవసైన్యాలను మంచిసమయంకొరకు భద్రపరచుకోవలసిన అవసరం వుందిగనుక ప్రస్తుతానికి సైన్యాన్ని ఇళ్లకు పంపివేయవలసివుంటుంది. మీరు యిళ్లకు తిరిగివెళ్ళి ప్రస్తుతానికి యిలాగే బాధ

పడిపలసివుంటుంది. పౌర దుస్తులను ధరించి మామూలు వేషాలతో వుండాలని సలహాయిస్తాను. మీ యూనిఫారం దుస్తులను నాశనంచేయండి." మనపవిత్ర ఆశయాన్ని మీరు మరవనంతకాలం మిలిటరీపభువుల్ని చివరికి తుదముట్టించి తీరుతారు. సైనికులుగా తర్ఫీదుపొందిన స్త్రీలందరూ వీరవనితలుగావాలి. భవిష్యత్తులో మన ఆశయాన్ని సాధించడానికి సిద్ధంగావాలి."

ఈ వాక్యాలు మాహృదయాల్లో చాకుల్లాగా వాడిగా గుచ్చుకున్నాయి...... రేపు నరకానికి పోవలసినరోజు. పురాతన దురాచారాల గృహాలకు మరలిపోవాలంటే నరక పరివేశం మినహా మరేంకాదు.

"మా యూనిఫారం దుస్తులుపోయాయి. మళ్లా ఎప్పుడు వాటిని ధరించేది !"

మా తుపాకిమాత్రం మా ప్రాణంకంటె ప్రియతమమైనట్టిది. పురాతన సమాజవిధానాన్ని ధ్వంసంచేసి, నూతన సమాజాన్ని సృష్టించడం దీనిమీదనే ఆధారపడివుంది. ఇప్పుడు అన్నీ మాచేతులనుండి దాటిపోయాయి. ఈ గొప్ప స్త్రీ సైన్యం రద్దుచేయబడింది. కాని ఆ ఉద్యమ పునాదిమాత్రం ఎల్లప్పుడూ సజీవంగానే వుంటుంది. 1927 లో విప్లవబీజాలు చైనా అంతటా నాటబడ్డాయి. ప్రతిపట్టణంలోను, పల్లెలోను విప్లవ ఫలితాలు ఫలిస్తాయనీ, అంతిమవిజయం మనదేననీ నాకు గాఢవిశ్వాసముంది"......

తిరుగుబాటుతత్వం, మానసిక మూర్ఖ స్వభావాల నిరసన, చైతన్యయుత దేశభక్తి, పింగ్ మాదిరిగా లక్షలాదిస్త్రీల జీవితాల నుద్దీపింపజేయడం, సర్వాన్ని—బలవత్తర విప్లవసై

[illegible] నిర్మించే మహోజ్జ్వల భవిష్యత్తుకు ఆటంకమైన వ్యక్తిపక్షంలో తమప్రేమనుగూడ—త్యాగంచేయగల యువకుల సంసిద్ధత, ఇవి ఆమె తనపుస్తకంలో ప్రబోధించిన మహత్తరగుణాలు. ఇవంతా విప్లవం ఆమెను ఒక్కర్తెకేనా? ఇతర స్త్రీలుగూడ ఆశయంయెడ అమరజీవియొక్క ఉత్సాహాన్ని పంచుకున్నారా? ఆశయానికి ద్రోహంచేసేకంటె తన జీవితాన్ని అర్పించిన మరొకచైనాయువతి షిల్లిస్‌లీయొక్కగాథ యిది.

17 సంవత్సరాల ప్రాయం వచ్చీ రాకమునుపే యీ అమ్మాయిని, జంగ్-కై-షేక్, కొమింటాంగ్ వారు అనుసరించిన సన్‌యట్‌సేన్ సూత్రాలనే కాలదన్నారని, ద్రోహం చేశారని ప్రకటించినందుకుగాను 1927 జూన్ 21 న జనరల్ జ్మో సైనికులు పట్టుకున్నారు. సాహసిక విమర్శన ఒక్కటే ఆమె నేరంకాదు. మరోనేరంగూడ వుంది. ఆమెతండ్రి, లీటాచావ్, చైనా కమ్యూనిస్టుపార్టీ సంస్థాపకుల్లో ఒకరుకాదా? 1927 నాటి కొమింటాంగ్ దృష్టిలో ఇదే మహాపరాధం! కాబట్టి ఆమె తన నిశ్చలతకు రెండునేరాలకు గొప్పశిక్షను అనుభవించవలసి వచ్చింది. మూడురోజుల ఘోరాతిఘోరహింసల తరువాతనైనా (ఆమె బ్రతికివుండగానే ఆమెప్రేగులు బయటికిలాగి ఆమె శరీరాన్ని ఆప్రేగులతోనే బంధించారు.) ఆమె తనకామ్రేడ్స్‌ను ద్రోహం చేయలేకపోయింది. ఆఖరికి ఆమె చంపబడింది. చైనాస్త్రీలు అలాంటి ధీరత్వంతోనే స్త్రీలవిముక్తి ఉద్యమం, పురుషునితో సమానంగా స్త్రీనిగుర్తించిన సోషలిస్టు సమాజం కొరకు స్త్రీ ఉద్యమానికి నాయకత్వం వహించారు.

ఆవిధంగా భీతావహం వ్యాపించింది. దౌర్జన్యాలు తరువాత దౌర్జన్యాలు పెచ్చుపెరిగిపోయాయి. మదాంసన్ దౌర్జన్యచర్యలకు కేంద్రమైన హాంకాంలోవుంది. ఆమె తన అమెరికన్ స్నేహితురాలు రాయ్నాప్రోంను హాంకాంనువిడిచిపెట్టి మరెక్కడైనా శరణ్యం తీసికోమనిమాత్రం ప్రశాంతంగా సలహాయిచ్చింది. జంగ్ సైన్యాలు ప్రముఖ విప్లవకారులందరిపై జరిపే ఘాతుకచర్యలను ఆమెను పూసగ్రుచ్చినట్లు వివరించింది. మదాంసన్ ప్రశాంతహృదయ, సమర్థురాలు. అటువంటి దౌర్భాగ్యదినాల్లో అటువంటి మహనీయురాల్ని హాంకాంలో కలుసుకొన్న విన్సెంట్ షీన్ ఆమెనుగూర్చి వర్ణించినదిది.

"అంధకారంచేయబడిన గదిచివరి తలుపు తెరుచుకొని నల్లసిల్కుదుస్తుల్లోనున్న ఒక చిన్న, లజ్జాకరయువతి గదిలో ప్రవేశించింది. ఆమె తన మృదులహస్తాలలో ఒకదానిలో టి. వి. సూంగ్ యొక్క నన్ను పరిచయంచేసే 'నోట్' ఒకటి వుంది. ఆమె మాట్లాడుటకు తనస్వరం విప్పగానే ఆస్వరం నన్ను గెంతేలా మోహరింపజేసింది. ఆస్వరం అంతమధురంగా, మృదులంగా వుంది......ఈభూమిమీద ఆమె ఎవరైయుండునా అని ఆశ్చర్యంతో దిగ్భ్రమచెంది నేలవంక చూచాను. నేను ఎన్నడూ ఎరగకుండా సన్ యట్ సేన్ కు కూతురుండా? ఈదివ్యమూర్తి, ఇంతటి దుర్బలురాలు, పిరికి హృదయ ప్రపంచంలో కీర్తిగాంచిన స్త్రీ విప్లవకారిణి అయిన ఆమె అని నాకు తోచలేదు. ఉగ్రస్వరూపాన్ని కలుసుకోబోతున్నానని నేను అభిప్రాయపడ్డాను. కాని నాముందు అత్యంత ఆకర్షణీయసౌకుమార్యంగల శిల్పప్రతిమ, నన్ను చూడగానేతత్త

రపడుతున్న మూర్తి ప్రత్యక్షమయింది......మదాంసర్‌కు తన పిరికితనాన్ని పారద్రోలుటకు ఆమెకు అనేక సుగుణాలున్నాయి ......నాయెదటనేగాదు, ఆమెజీవితంలోనే పిరికితనంవుంది... అతి ప్రమాదభరిత సమయాల్లో సైతం ఆమెను అచంచలంగా నిలబెట్టుటకు నైతిక బలం. ఆమెకు చాలావుంది. ఈ సుగుణాలు నైతిక బలం, ఆమెయొక్క శారీరక రూపంలో ప్రదర్శితమయ్యే దుర్బలత, లజ్జలను త్రొక్కుకొని నిలద్రొక్కుకొనడానికి ఆమెకు బలాన్నిచ్చాయి. ధీరత్వాన్ని చేకూర్చాయి... చావు ఆమెను పిరికి పారనీయలేదు. దారిద్ర్యం, ప్రవాసం, తనకుటుంబకోపాన్ని, ప్రపంచదూషణలు ఆమె 'చెడు' అనుకున్న విధానాలవైపు మరలించలేకపోయినాయి. ఆదివ్యమూర్తి శక్తిని గుర్తించబోయే ముందు నీవు ఆమె సుగుణాల్ని తెలుసుకోవాలి......తరువాత గడచిన నెలలకాలంలో ఆమెయొక్కగౌరవప్రతిష్ఠలు ఎంతగా మిన్నుముట్టాయంటే శారీరక, మానసిక శక్తులేకాకుండా స్వభావరీత్యా, పవిత్ర ఆశయం, న్యాయబుద్ధి మొదలగు సద్గుణాలతో ఆమె పీరోచితంగా, ధీరయువతిగా మూర్తీభవించింది"......

మదాంసర్‌కు యివి ప్రమాదకరమైన గడ్డురోజులు. తరువాత సంభవించిన పరిస్థితులను త్రొక్కుకోవడానికి ఆమెకు మనోబలం అవసరమయింది. విప్లవప్రతీఘాతఉద్యమం చైనాలోని ఉత్తమయువకులను బలిగొంటూ వ్యాప్తిచెందుతోంది. జూలై 15 న మదాంసర్ తదితరవామపక్షీయులు మారువేషాలతో దేశమంతటా, బయటా చెల్లాచెదరు కావలసివచ్చింది. మదాంసర్ సోవియట్‌రష్యాలో శరణ్యం తీసికొన్నది వెంటనే జీవితా

నికి ప్రమాదభరితమైన తనదేశానికి మరలిపోయే అవకాశం లేకపోయింది.

మాస్కోలో సోవియట్ ప్రభుత్వం ఆమెకు వలసిన సౌకర్యాలన్నిటినీ సమకూర్చింది. ఆమెఆధీనంలో ఒకకారునుగూడ ఉంచారు. అయినా తన స్నేహితుడు రాయ్నాగ్రోం దహన సంస్కారానికి కారు శరణుజొచ్చకుండానే రష్యన్ నవంబరు కటిక చలిలోగూడ వణుకుతూ తన సన్నని సిల్కు దుస్తుల్లోనే మాస్కోవీధుల్లోబయలుదేరి, నడచివెళ్ళింది. చైనానుండి ఆమె ఆదాయం ఆపుచేయబడింది. నూతన పరిచయులనుండి సహాయం పొందడం ఆమె అభిమానం అనుమతించ లేదు. మాస్కోలో ఆమె నివాసం ఆమెకు పూర్తి విచారకరమైనట్టిది. చాల జబ్బుపడింది. సోవియట్ ప్రభుత్వం ఆమెను స్వస్థతకొఱకు క్రిమియాపంపింది. మరల తిరిగివచ్చేటప్పుడు రైలులో అమెరికా పత్రికలన్నీ ఆమె మాస్కోకు ఒక చైనానాయకునితో లేచిపోయిందనీ, ప్రస్తుతం క్రిమియాలో ఆనందడోలల నూగుతున్నారనీ ప్రకటించి నట్లుగా తెలుసుకున్నది. ఈ "షాకు"తో ఆమె పెద్దదెబ్బతిని, నరాలబలహీనత పూర్తిగా వచ్చేసింది. ఈ దెబ్బనుండి కోలుకొంటున్న సమయంలో మరో "షాక్" తగిలింది. ఆమెచిన్నచెల్లెలు సూంగ్ మింగ్ లింగ్ జంగ్ కై షేక్‌ను వివాహం చేసికొంది.

రష్యాలోనే ఆమె జవహర్‌లాల్ నెహ్రూను కలుసుకొన్నది. తరువాత చైనాకువచ్చి కొంతకాలం రహస్యంగానే వున్నది. ఆమె పౌరసత్వాలను, వాక్స్వాతంత్ర్యాలకై ఆందోళనచేయడములో సహాయపడింది. డిఫెన్సులోగ్ సంఘటిత

పరచి రెడార్మీకి డబ్బు, మందులు సప్లయిచేశారు. చైనా ప్రజాసామాన్యంలో మదాంసన్‌కంటె ఎక్కువగా ప్రేమించ బడినవారులేరు. ఆమె సామాన్యప్రజానీకం తరఫున సౌఖ్య జీవితానికి జరిపే వారి పోరాటంతరఫున నిలబడింది. చైనాలో 7 సంవత్సరాలు గడపినతర్వాత మరలివచ్చిన జర్నలిస్టు యిలా చెప్పాడు: "ఓ మదాంసన్ !.........ఆమెఅద్భుతమైనది, ప్రియతమమైనది,"

—

# ఎర్ర యోధులు

కూలిన గుడిసెను అందాలమేడతో పోల్చలేం,
చినిగిన పేలికలను ఎంబ్రాయిడరీ అల్లిన సిల్కువస్త్రాలకు
పోల్చలేం;
కలుపు, కుళ్లు, పచ్చగడ్డి, చెట్లతోలు యిప్పటికే స్వాహా
అయినాయి;
ఇక చిచ్చునార్పుటకు మిగిలిందేమిటి రైతులకు?
తిండీ, బట్టా ఊడిగానికికూడ లభ్యంకావు,
ఈ యుగానికదే యమునిగంట మ్రోగుతోంది;
సహాయమర్థించే నిరాహారుల ఆక్రందనలో మారుమ్రోగు
తోంది!

అరసోలెడుబియ్యం అరువు తెస్తే,
దానికిమూడు రెట్లు తీర్చాలి.
వడ్డీకొరకై సారాపీపాలవలె రక్తాన్ని పీలుస్తారు.
పన్నువసూలుదార్లు విషసర్పాల్లా చుట్టుముట్టుతారు.
చూడు! చిమ్నీలు పొగవదలడంలేదు
అవి ఇక పనికిరావు............"

చైనాలో పరిస్థితులు త్వరత్వరగా మారుతున్నాయి. కార్మికులు తిరుగుబాటుచేసి చాంగ్‌చంగ్, ప్వాటో రేవులను స్వాధీనపర్చుకున్నారు. సన్ యట్ సేన్ సాహసికచర్యలను రంగ

మైన కాంటన్ ఆక్రమణ సార్థకం చేసి విప్లవానికి చుక్కాని అయింది. కాంటన్ కమ్యూన్ !...—విముక్తి కోసం పోరాడే ప్రతి సైనికుని హృదయాన్ని ఉత్తేజపరచే పదాలు. (పారిస్ కమ్యూన్ తరువాత కాంటన్ కమ్యూన్") ఈ చరిత్రాత్మక ఘటనలు కియాంగ్సీలో సోవియట్ ప్రభుత్వస్థాపన సాహసికులుగా గుర్తించబడిన స్త్రీలను ఎంతో అగ్రస్థానానికి గొనివచ్చాయి.

మరో అమ్మాయి ఛాంగ్, నూతనచైనా రెడార్మీ కమాండర్ ఇన్ ఛీఫ్ యొక్క ప్రథమభార్య. త్వరితగతిని సాగుతున్న 1928 నాటి రోజుల్లో రెడార్మీ కియాంగ్సీ గుండా యాత్ర జరిపి రైతులను విముక్తిచేసి కొమింటాంగ్ సైనికులనుండి బలీయమైన కీలకమైన పట్టణాలను స్వాధీనపర్చుకున్న రోజుల్లోనే మనం ఛాంగ్ పేరు వింటాం. రంగం, చుట్టూగోడలు కట్టబడిన వేయాంగ్ పట్టణం. ఆపట్టణ కార్మిక కర్షకులు తమ పీడకులపీడ ఏనాడో వదలించనుకొన్నారు. యాగ్నిస్ స్మెడ్లే వివరించినట్లుగా, "నల్లమందువ్యాపారులు, వడ్డీవ్యాపారస్థులు, భూస్వాములు, అధికార్లు మొదలగు "గౌరవనీయులు" పట్టణాన్ని ప్రజలహస్తగతంచేసి పారిపోయారు. "గోడలపై అరుణపతాకం విరాజిల్లుతోంది.....అరుణచ్ఛాయ, గొప్పఉత్సవాలన్నింటా చైనీయులుపయోగించేరంగు.....ఆశ, జీవితములఛాయ, భూమే, రెడార్మీసైన్యాలరాకకై ఎదురుచూస్తూ పట్టణమంతా ఉత్సాహంతో ఉప్పొంగుతున్నారు. చివరికి గోడలపైనున్న సెంట్రీలు రెడ్ బ్యానర్లు గాలిలో రెపరెపలాడటం దూరాన్నుండే గమనించారు. ఇక ప్రజలు "తమ సైన్యాలను" కలుసుకొనుటకు పట్టణంవెలుపల గుమిగూడారు. వారిలో వేయాంగ్ పట్టణస్త్రీల

యూనియనుకు అధ్యక్షురాలు ఛాంగ్ కూడవుంది. ఆమెపొడగరి, కాళ్ళిపుట్టు, సహజమైనపాదాలు కలిగియుంటుంది. రెడార్మీకి స్వాగతం పలుకుటకుముందు వెళ్ళింది ఛూటేనుకూడ కలుసుకొంది.

తరువాత గడచిన మాసాల రెడార్మీఆర్మీదళాలు ఎదుర్కొనవలసివచ్చిన అతిభయంకర క్లిష్టసమయాల్లో కొమింటాంగ్ సైన్యాలతో పోరిన అనేకయుద్ధాల్లో, కరువుదినాల్లో, దహించుకుపోతున్న ఖాళీఉదరములతో 30రోజులుగడపిన అనిచ్ఛాకృత యాత్రలో ఛాంగ్ ప్రజలతోబాటు 'మార్చ్'చేసింది- ప్రశాంతంగా, తుపాకీచేతబట్టి, దళమంతా మురికిబారిపోయింది. పేలు పట్టాయి. పాదాలకు ఏమీలేకుండానే నడిచారు. అందువల్ల వారిపాదాలు పుళ్ళు, తెగుళ్ళతో రక్తం కారుతున్నాయి. వారుమంచుదిబ్బలపై దుప్పట్లుగాని, వెచ్చని దుస్తులుగాని లేకనే నిద్రించారు. ఇదంతా ఛాంగ్ కేవలం సాహసంతో, ప్రశాంతతతో, ఎట్టి ఆక్షేపణలు లేకనే సహించింది.

జాపోటాలో రెడార్మీ పస్తులతో దహించియుండి, పూర్తిగా అలసటచెందియున్నప్పటికీ కొమింటాంగ్ సైన్యాల గొప్పదండుతో పోరుసల్పవలసివచ్చింది. శత్రువు సామ్రాజ్యవాదమిత్రులు సహాయంచేసిన అన్ని నవీనఆయుధాలతో సర్వసన్నద్ధుడైయున్నాడు. రెడార్మీకంటె రెండింతలు బలంగావుంది శత్రువులకు. కార్మికసైన్యానికున్న కొలది 'బుల్లెట్'లు కాసేపులోనే అయిపోయినాయి. అయినా వారు మొక్కవోని ధైర్యంతో పోరుతున్నారు. ఛాంగ్ యుద్ధరంగముమ్మరంలో వుంది. తుది బులెట్ నుపయోగించి తన తీర్చిన బాయొనెటో

తాను ముందుకుసాగిపోయింది. ఒక బులెట్ తగిలి గిరగిరా త్రిప్పివేసింది. అయినా ముందుకే ఉరికింది. మరో బులెట్ ఆమెను క్రిందకు చేరగిలవేసింది......ఆమె చనిపోయేముందు తన రైఫిల్‌ను తనప్రక్కనే పోరాడుతున్న తోటికామ్రేడ్‌కు అందించింది. మరణసమయంలోగూడ ఒక్కరైఫిల్ గూడ శత్రువుకు చిక్కరాదనే విషయం గుర్తుంచుకొన్నది.

యుద్ధంగంటలతరబడి సాగుతూనేవుంది. వైట్స్ (కోమింటాంగ్ సైన్యాలను అలాపిలిచేవారు) తుది దాడి జరిపే ప్రయత్నంలో ఉండగా ఉభయపక్షసైన్యాలకు ఆశ్చర్యకరంగా సాయంసమయపు పిల్లవాయువు వీచింది. మరో సైన్యం కదం ద్రొక్కుతున్న ధ్వనులు. దూరాన ఒక కొండఉపరిభాగాన, సాయంసమయపు పిల్లవాయువులో తేలియాడుతూ, వందలాది రెడ్ బ్యానర్లు అస్తమయపు సూర్యకాంతిలో ప్రకాశిస్తున్నాయి. అదిచూచి రెడార్మీ సురలదాడి జరిపింది. "వైట్స్" వెన్ను చూపారు.

యుద్ధం పరిసమాప్తిచెందింది. రెడార్మీ విజయం సాధించింది. అతి కష్టసమయంలో తమకుసాయంగావచ్చిన నూతన సైన్యంవైపు వెనకకుమరలిచూచారు. ఆసైన్యం ఎలాంటిదో వారుచూచినప్పుడు వారలు అనుభవించిన గర్వం, ఉత్సాహం సంతోషం పట్టనలవికానివి. ఆ సైన్యంలో వందలాది స్త్రీలు, పిలలుమాత్రమే యున్నారు. ఎర్రసైనికులెలాంటి ఆపత్తులో ఉన్నారో గమనించి వెంటనేవారు పాతపీపాలు, డోళ్లు సంపాదించి వేలాది ఎర్రజెండాలను, బ్యానర్లను తయారుచేసి యీ దివ్యసృష్టితో హంగామాతో గొప్పసాయుధ

సశస్త్రసైన్యం ఉరకలుపెడుతున్న భావాన్ని కల్పించారు. వారి చక్కని వివేకవంతమైన ఉపాయం విజయంగాంచింది. వైట్స్ పారిపోయారు. విజయం విప్లవకారులదే! కాని ఆ విజయం ఎంతగొప్ప మూల్యానికి! అనేకమంది ధీరయోధులు నేలకొరిగారు.

యుద్ధం ముగిసినతర్వాత గడచినసమయం అందరికీ విషాధమైనట్టిది. నేలకొరిగిన కామేడ్సు కందరికీ సమాధులు త్రవ్వబడ్డాయి. ఛాంగ్‌శ్వరం ఆమె ఇద్దరుకామ్రేడ్సమధ్య ఒక సమాధిలో గౌరవించబడింది. ఈ సాధారణ పద్ధతి ఆమె ప్రజలు ఆమెయొక్క మూల్యాన్ని గుర్తించారు. ప్రపంచంలో కెల్లా మహత్తరమైన ఆశయం, మానవజాతి విముక్తి ఆశయం" కొరకు పోరాడే వీర సైనికు రాలుగాఅంజలి అర్పించారు.

తనదేశవాసుల పీడితప్రజానీకానికి సౌఖ్యప్రద ప్రపంచాన్ని నిర్మించడములో ఆమె ఒక ప్రాణాన్ని అర్పించింది. ఆమెయేకాదు, తదితర చైనాస్త్రీలుగూడ ఆమెజీవితం, ఆమె భాగ్యంలో సమభాగులే.

నూతనచైనాశక్తికి ట్సీమెయ్‌కథ మరోతార్కాణం. ట్సీమెయ్ ఒక రైతుభార్య, గొప్పకరువురోజుల్లో భూస్వామి "వూకు" తన భర్తచే అమ్మివేయబడింది. తరువాత ఆమెభర్త వడ్డైనాపని సంపాదించుకొనుటకు పట్టణానికి ప్రయాణం చేయవలసివచ్చింది. ఒకానొక తిరుగుబాటులో తనను స్వత్వం చేసికొన్న భూస్వామినిచంపి అతనిరైఫిలును స్వాధీనపర్చుకొంది. తరువాత ఆమె పార్టిజాన్‌దళంలో చేరి 130 మంది సైనిక దళానికి నాయకత్వం వహించింది. దక్షిణ హ్యూనాన్‌లో

తిరుగుబాటు అణచివేయబడినపుడు రైతులందరూ కమ్యూనిస్టు లకు బలీయమైన చుంకింగ్ పార్టీకు వదలివెళ్లారు. వారిలో ట్సీమెయ్ కూడావుంది. ఆమెతో కూడి 12 మంది స్త్రీలు, బాంబు లనుకూడ తీసికొనివచ్చింది,

చైనాలో చాలసంవత్సరాలు రాజకీయవర్కరుగా, జర్న లిస్టుగా పనిచేసిన యాగ్నిస్ స్మెడ్లీ ఆమెనుగూర్చి యిలా వర్ణించింది. "ఆమె పొట్టిమనిషి. ఆమె గడ్డంమీద వికృత మైన మచ్చవుంది. ఎడమచేతివేళ్లు రెండు తెగిపోయినాయి. వాటిగాయాలు యింకా మానలేదు. ఆమెవెంట్రుకలు పురుషు లకువలె కురుచగా కత్తిరించబడ్డాయి. ఆమె నీలిప్రాజన్లు చిరిగి వున్నాయి. ఆమె బూడిదవర్ణంజాకెట్ చిరిగి పీలికలై వ్రేలాడు తోంది. ఆమెబెల్టునుండి రెండుచేతిబాంబులు (గుర్రాలు కల బాంబులు) వ్రేలాడుతున్నాయి.

ఎర్రసైనిక కమాండరుతో ఆమె యిలా చెప్పింది. "నాపేరు ట్సీమెయ్; భూస్వామి 'వూ'కు నేను వ్యవసాయ కూలిగా వుండేదాన్ని. మేం తీవ్రంగానే పోరాడాం. కాని వైట్స్‌కు చాలాతుపాకులున్నాయి." తరువాత జరిగినపోరా టాల్లో ఆమె అత్యంత సాహసాన్ని, వీరత్వాన్ని ప్రదర్శించింది.

ఎర్రసైనికుల ప్రముఖపోరాటాల్లో ఒకదానిని వర్ణించిన "ఏడువందతెనలకథ" లో ట్సీమెయ్‌ని మాటిమాటికీ ఉదహరించ డం మనం గమనిస్తాం. రెడార్మీ స్థావరాలనుండి శత్రుసైన్యా లను పారద్రోలుటకు శత్రువు వెనుకభాగాన్ని దాడిచేసిన రైతు లకు ఈమెయే నాయకత్వం వహించింది. ఈ చరిత్రాత్మక పోరాటంలో చాలమందిరైతుస్త్రీలు, అంతకుపూర్వం ఎన్నడూ

పోరాటమెరగని స్త్రీలు తమపురుషులతోబాటు వీరోచితంగా పోరాడారు. గాయపడినవారిని యుద్ధరంగంనుండి మోసికొని పోవుటలో సహాయపడ్డారు. ఎర్రసైనికులకు నీరు అందించి, అన్నివిధాల సహాయపడ్డారు.

కొన్నాళ్లకు రెడార్మీ పరిమత్తులైయున్న సమయంలో కొమింటాంగ్ సైన్యాలు రెడ్‌స్థావరాన్ని దాడిచేసి హాస్పట లులో పడియున్న గాయపడినవారినందరినీ హతులను గావిం చాయి. వారిలో అలా హతులైనవారిలో ట్సీమెయ్ ఒకర్తె కమ్యూనిస్టుసైన్యాలు తిరిగివచ్చుసరికి ఆమె తనతోటి కామ్రేడ్స్‌తో పడియుంది. ఆమెనంటినిండా కొరడాదెబ్బలు, ఆమె వక్షాలు కత్తిరించబడ్డాయి. ఆమెతల వ్రయ్యలైయుంది...... ధీర, వినమ ట్సీమెయ్, నీవు నిశితంగా పోరాడావు. కాని వైట్స్‌కు చాలాతుపాకులున్నాయి !

ఈస్త్రీలు దాస్యాన్ని వ్యతిరేకించి పోరినవారిపట్లుదలకు నీవు ఆశ్చర్యపడవచ్చు. దారిద్ర్యంలో పుట్టారు : సంతోషానికి సౌఖ్యానికి ఆశలేదు. వారి జీవితంలో భాగ్యమనేది మరణమే. వారి తల్లిదండ్రులు పసితనంలోనే "పులిహృదయంవలె నిర్ద యాత్మకమైన "ధనికులకులవారిని అమ్మివేయనైనా అమ్ము తారు. లేదా, శాశ్వతంగా సాధారణ మానవ మాత్రులకు అతీతమైన వ్యభిచారగృహాలకు అయినా అమ్మతారు. ప్రతి విషయానికి వారు పన్నులుచెల్లించాలి. విద్యపన్ను, (విద్య కేవ లం ధనికులకే అయినప్పటికీ) శవాలపన్ను, నూతనంగా జన్మిం చిన బిడ్డపన్ను, చిమ్నీపన్ను ఇంటిపన్ను, నీటిమార్గంపన్ను.

ఒక చైనా స్త్రీ రచయిత జౌషీ, ఒక రైతు స్త్రీ తనకు గల యిద్దరిబిడ్డలయందు ప్రేమకై ఎలా హింసించబడిందో వివరించింది. ఆ రైతుస్త్రీకి మూర్ఖుడు, త్రాగుబోతుఅయిన ఒక పేద రైతుతో వివాహం అయింది.

ఆమెను ఆమెభర్త ఒకభూస్వామి కుటుంబానికి 5 సంవత్సరాలకుఅమ్మివేసినపుడు ఆమెకు రెండుసంవత్సరాల బాలుడు, యింకనూ తన రొమ్ముపాలు కుడుపుతున్న బాలుడున్నాడు. భూస్వామి ముదుసలి. అతనిభార్యకు సంతానంలేని కారణంగా అతనికి ఒకవారసుని, బిడ్డను కనియిచ్చుటకు ఆమెను 5 సంవత్సరాలకు కొనుక్కున్నాడు. ఆమెఅంతకాలం తనబిడ్డనుచూచుకొనుటకుగూడ నోచుకోలేక వదలివేసి గొప్పయింటికి వెళ్లిపోయింది. ఆమె అతనికొరకు ఒకపిల్లవానిని కనియిచ్చిన తరువాత మరల ఆరైతుయింటికే పంపించివేయబడింది. భూస్వామి యింట్లో ఉన్నపుడు, యింటిదగ్గర పశుహృదయుడైన తండ్రికి దయాదాక్షిణ్యానికి వదలివేసిన పసిబిడ్డ, తనకుకలిగిన ప్రథమ సంతానంకొరకు, సంతానప్రేమకొరకు ఆమెమనస్సు ఎంతో బాధపడింది. మరల యింటికి తిరిగివచ్చేటప్పటికి నెలలప్రాయపుబాలుడైన రెండవ సంతానంకొరకు దుఃఖపడింది. ఆమె తొలిబిడ్డ ఆమెను మరిచిపోయాడు. ఇకయిపుడు ఆమె మానసికంగా, శారీరకంగా విరిచివేయబడిన దానివలె చాప మీాద పడి యుంటోంది. చైనాలో అధిక సంఖ్యాక స్త్రీల పరిస్థితి అది; స్త్రీలకు ఏహక్కులూలేవు, వారిశరీరాలమీాదగాని, వారిబిడ్డలమీాదగూడ హక్కులేదు. ఇండియాలోని స్త్రీలు గూడ అలాంటి అసౌకర్యాలతో బాధపడుతున్నారు.

కాబట్టి స్త్రీలు మానవహోదాతో ప్రతికహక్కు కొరకు తమ శరీరాలపై హక్కు కలిగియుండటానికి, తమ బిడ్డలను పెంచుకునే హక్కు కొరకు పోరాడారంటే ఆశ్చర్యంలేదు. ఈ విషాదస్త్రీల హృదయాలలోని కోపాగ్ని వారు అప్పుడప్పుడు పాడే యీపాటలో ద్యోతకమౌతుంది :

"నాసోదర దేశభక్తుని యుద్ధానికంపుతున్నా
విప్లవబాట విస్పష్టం చేసేందుకు,
కోమింటాంగును తుడిచిపెట్టుటకు,
బీదప్రజానీకాన్ని పీడించే
మిలిటరిస్టులను, మరి పెద్దలను నాశనంచేసేందుకు."

---

# సారస్వతోద్యమంలో స్త్రీలు



విప్లవదశవిధిగా సాహిత్య అమరుల్ని సృష్టిస్తుంది.
నూతనప్రపంచసృష్టికై ప్రమాదాన్ని డీకొన సాహసిస్తారు
వారు.
కొందరు నిర్మూలించబడ్డారు, మరికొందరు బీదలుగాచేయ
బడ్డారు. ప్రథములు శాశ్వతానికి దాటిపోయారు.
ద్వితీయుల్ని బ్రతికి పడ్వటానికి వదిలేశారు; కానీ,
రాబోవుయుగం అభ్యుదయం,
అభ్యుదయ సాహిత్యంతో అలంకృతమైనది."

—లూహసన్.

సాంఘిక, రాజకీయ విప్లవాలతోబాటు మరోవిప్లవం గూడ వుంది. అవి రెండువిప్లవాలు స్త్రీలఅభివృద్ధికి ఎంతప్రాముఖ్యమో ఆవిప్లవంగూడ అంతప్రాముఖ్యంగలది. అదే, సారస్వతోద్యమంలో విప్లవం. చైనాలో ఎల్లప్పుడూ పండితులకు, ప్రజలకు గొప్ప అగాధముండేది. పండితులు గ్రాంథికమైన 'వెన్-యెన్' భాషలో వ్రాసేవారు. ప్రజలు వాడుకభాషమైన 'పియాహువా'లో మాట్లాడేవారు. చైనాలో సాధారణవిద్యాభివృద్ధికి ఇదిగూడ ఆటంకమైంది. ప్రజలు పండితుల్ని అపహాస్యం చేసేవారు. పండితులు ప్రజల్ని బొత్తిగా అలక్ష్యం చేశారు.

ఒక వింతైనకథ పండితులయెడ ప్రజల అభిప్రాయాన్ని విశదంచేస్తుంది. చైనాలో పండితులు ప్రత్యేకవర్గానికి చెందినట్టి వారు.

ఒకనాడు క్రూరజంతువుల గుంపొకటి ఒకకొండ ప్రక్కన వేటకై సమావేశమైంది. దినమంతా వేటాడి మరల సాయంకాలం అన్నిజంతువులు అవి చంపిన జంతువుల్ని పంచుకొననలెనని తీర్మానించుకొన్నాయి. సాయంకాలమయ్యే సరికి ఒక్కపులిమాత్రమే రిక్తహస్తాలతో తిరిగి వచ్చింది. ఊరకనే ఎందుకువచ్చావని అడిగినమీదట పులి దుఃఖభరితమై యిలాచెప్పింది. "ఉదయం నేను ఒకస్కూలుపిల్లవానిని కలుసుకున్నాను. కాని అతడు మీ రుచులకు చప్పగా ఉంటాడని భయపడ్డాను. మధ్యాహ్నం ఒకపూజారిని కలుసుకునేంత వరకు నేను మరెవరినీ కలుసుకొనలేను. కాని అతడు వృత్త గాలితిత్తితప్ప మరేంకాదని నేను వదిలేశాను. ప్రొద్దుక్రుంకు వరకు నాకెవరూ కానరాలేదు. ఎంతో విచారపడ్డాను. సందె చీకటి పడుసరికి ఒకపండితుడు మాత్రం కనిపించాడు. కాని అతడు గట్టిగా, పెడసరంగావుండి మనం తిన ప్రయత్నిస్తే మన పళ్లూడతాయనే భయంతో తీసికొనిరాలేదు."

1917లో "పియాహువా" ఉద్యమం చురుకుగా ప్రారంభమైంది. 1917కు పూర్వంకూడ వాడుకభాష నుపయోగించుటకు అనేకమంది యువరచయితలు బయలుదేరారు. వారిలో స్త్రీలుగూడ వున్నారు. కాని 1917 తరువాతనే ఉద్యమం తల యెత్తింది. ఇపుడు స్కూలు పాఠ్యపుస్తకాలు, పత్రికలు పియా-హువాలోనే వ్రాయబడుతున్నాయి.

ఈకాలంలో గొప్ప ప్రముఖసాహితీకారుడు చైనీస్ గోర్కీ అని పిలువబడే లూహాసన్. ప్రతిభావంత, అభ్యుదయ రచయితలు చెందియున్న చైనీస్‌లీగ్ ఆఫ్ లెఫ్ట్‌రైటర్సు (చైనా తీవ్రవాద రచయితలసంస్థ)ను స్థాపించినవారిలో లూహాసన్ ఒకడు. చైనా ప్రిప్రథమ, ప్రముఖ స్త్రీరచయిత అయిన టింగ్ అంగ్ గూడ ఆసంస్థసంస్థాపకుల్లో ఒకరు. కార్యవర్గ సభ్యురాలు.

పెకింగ్ విద్యార్థులచే ప్రారంభించబడి సాహిత్య ఉద్యమంచే నడుపబడిన "మేఘోత్తుఉద్యమం" సామ్రాజ్యవాదం, భూస్వామ్యవిధానాలకు వ్యతిరేకంగా మళ్లించబడింది. ఈ ఉద్యమంలో ఎక్కువమంది మేధావంతులు పాల్గొన్నారు. చాలమంది స్త్రీ రచయితలుకూడ తమపాత్ర నిర్వహించారు.

ఈ దశలోని ప్రముఖ స్త్రీరచయితలు 'లూయిన్, పింగ్‌షిన్, పేమింగు.' ఈ గ్రూపు తమ అనువాదములద్వారా ప్రపంచసాహిత్యసాంప్రదాయాలను చైనాప్రజలకుఅందించారు. ఈకాలంలోనే టాగూరురచనలు అనువదించబడ్డాయి. పీపింగ్-షిన్‌పై టాగూర్ రచనలప్రభావం పడింది. ఉన్నత అధికారులు, భూస్వాములకు చెందిన ఉన్నతకుటుంబములో జన్మించిన పీమింగు గొప్ప ధైర్య, సాహసోపేత రచయిత. ఆమె చైనాసాహిత్యములో నిషిద్ధమైన సాంఘికప్రాధాన్యతగల విషయాలను ప్రవేశపెట్టినది. ఆమెశైలి విప్లవవాస్తవికత. ఆ కాలపుతీవ్ర, యువరచయితలలో ఈమెఒకతె. చైనాలో అభ్యుదయరచయితలందరు గురిఅయిన భయభీతాహాలనుండి తప్పించుకొనుటకై అనేకమారుపేర్లతో కథలనువ్రాసింది. పీమింగ్ అనేదిగూడ ఆ మారుపేర్లలో ఒకటి. తొలి అభ్యుదయ సాహి

త్యమంతా భూస్వామ్య విధానముక్రింద అణగారినవ్యక్తుల పోరాటమునకు సంబంధించియుండేది. స్త్రీపురుషుల ప్రేమ, స్త్రీల స్వాతంత్ర్యమే పుస్తకాలు, కథలలోని విషయములయ్యేవి. 1917 నుండి రచయితలపై ఇబ్సెన్, షాలప్రభావం పడింది.

లూయిన్ పరమపదించింది. కవయిత్రికంటె మిన్నగా పరిగణించబడిన పీపింగు-షిన్ ప్రస్తుతము గృహస్థజీవితం గడుపుచున్నది లేదా జపాన్ యుద్ధమువరకు గడిపింది. ఆమె రచనలు మాతృప్రేమ, పుత్రివాత్సల్యములను ప్రబోధించేవి. నేటికీ, భావమ్ములలత్వకారణముగాఆమెరచనలుచదువబడుతున్నాయి. ఆమె రచనలు నేటి చైనాపాఠకులనుగూడా ప్రబోధిస్తుంటాయి.

గొప్పసాహితీ ప్రాముఖ్యతగల రచయితలు అనాడు లేకపోయినప్పటికీ సాహిత్యంలో అభ్యుదయోద్యమము వ్యాపించి, విద్యావంతులైన స్త్రీపురుషులలో పలుకుబడి సంపాదించగలిగింది. విప్లవప్రతిఘాతోద్యమం వ్యాప్తమౌతున్న యీ ఉద్యమాన్ని గూడ విడిచిపెట్టలేదు. 1927 నుండి యువరచయితలపై దారుణమైన హింసాకాండలు, పశుప్రాయమైన హింసలు కొనసాగించారు. 1930లో తీవ్రవాద రచయితల సంఘ నెలకొల్ప బడింది. ఆ సంఘ పత్రికయైన "ది గ్రేట్ డిప్పర్"నకు టింగుఅంగుసంపాదకత్వం వహించింది. కొమింటాంగు వైజ్ఞానిక సంపదలను కొల్లగొట్టటానికి స్పెషల్ పోలీసును "బ్లూజాకెట్స్" ను ఏర్పాటు చేశారు.

ప్రస్తుతచైనాలో నవీనరచయితలందరిలోను గొప్ప ఖ్యాతిగలవారిలో టింగుఅంగు యొకామె. ఆమె హ్యునాన్ రాష్ట్రనివాసి. 18 సంగల ప్రాయంనుండే చిన్నకథల రచనా

తగా ప్రశస్తిలోనికి వచ్చింది. ధనం లోటుకారణంగా ఆమె చదువుకు భంగం కలిగింది. అయినా ఆమె ఓపికతో తన రచనలను కొనసాగిస్తూనే, తన ప్రథమపుస్తకం "డైరీ ఆఫ్ సోఫే", ప్రకటితమయ్యేసరికి దనకుతానే కీర్తిని గడించగలిగింది. ఈ ప్రాథమికదశలో ఆమెరచనలు, కథలు యువజనుల భావాలు, సమస్యలు—పురాతన భూస్వామ్య, నూతన అభిప్రాయాల మధ్యవైరుధ్యం,—స్త్రీలను గూర్చి ప్రేమసాహిత్యం, సాంఘిక సమస్యలను గూర్చి వివరిస్తూవుండేవి. ప్రాధమికదశలోకూడఆమె శైలితీవ్రంగాఉండేది. అందువలననే పురుషశైలి అనిపిలువబడేది. ఈ సమయంలోనేఆమె, తీవ్రవాదరచయితల సంస్థాపకుల్లో వకరైనహూయే-పింగును కలుసుకొనడంతటస్థించింది. అతడుకూడ చిన్నకథల రచయిత, విద్యాబోధకుడు; కమ్యూనిష్టుపార్టీసభ్యుడు. హూయే-పింగు, టింగుఅంగు వివాహమాడిన తరువాతనే ఆమె ఎక్కువగా తీవ్రవాదమువైపుకు మొగ్గింది. 1931 ఫిబ్రవరి 10 న హూయే-పింగు మరియు 23 మంది రచయితలు "బ్లూజాకెట్లు"చే హత్యగావించబడ్డారు. ఆ 25 గురిలో ఎక్కువమంది సజీవులుగానే పాతిపెట్టబడ్డారు. హూయే-పింగుకూడ వారిలో ఒకడు. అందరూ అంతర్జాతీయ విప్లవగీతాన్ని పాడుకుంటూ తమ మరణాన్ని ముద్దిడుకున్నారు. ఈ అమరజీవుల్లోనే ఫెంగుకాంగు అను ఒక స్త్రీరచయిత, అత్యంత ధీశాలిని, గొప్పభవిషత్తు కలిగిన రచయితగూడ వుంది.

హూ భార్యగాబట్టి టింగ్అంగ్ గూడ యీసమయంలో హత్యగావింపబడేదే. కాని తన పసిబిడ్డతో సహా తన భాష్య

మైన హ్యూనాన్‌కు వెళ్లిపోయి అక్కడే కొంతకాలం ప్రచ్ఛన్నంగా వుంది. తరువాత బిడ్డను తల్లిదగ్గర వదిలేసి షాంఘైకు తిరిగివచ్చి తన కార్యక్రమాన్ని మరల ప్రారంభించింది.

నదికట్టల మరమత్తుకు యివ్వబడిన సొమ్ము లంచగొండి అధికారుల జేబుల్లోకి పోయినకారణంగా తరచుగా సంభవించే యాంగ్సీనది వరదలనుగూర్చిన గొప్పనవల పూర్తిచేసిన తరువాత ఆమె ఒక చరిత్రాత్మక విప్లవక నవలను ప్రారంభించింది. ఈనవల రచించునపుడే ఆమె 1933లో అరెస్టుచేయుబడింది. తీవ్రవాదరచయితల సంస్థ 1933 జూన్‌లో ప్రకటించిన స్టేట్‌మెంటులో ఆమె అరెస్టునుగూర్చి వివరంగా తెలియజేయబడింది.

"......హింసాకాండ ఇపుడు తన వైరినాలుకలను చాచింది. మరి ముగ్గురు కామ్రేడ్స్‌ను, టింగ్ అంగ్, అమర జీవి హూయే-పింగ్ భార్య, పాన్‌చునేన్, యింగ్ షూజెన్ మొదలగు ప్రముఖరచయితలను అరెస్టుచేసి తీసికొనివెళ్లారు.

"టింగ్ అంగ్ చైనాయొక్క మహోత్తమ స్త్రీరచయిత. నూతన విప్లవ సాహితీకారుల్లో ఉత్తమురాలు. మేధావంతమైన, కళోపేతమైన పరిజ్ఞానం ఆమె ప్రతియొక్క ప్రతి రచనలోను ప్రతిబింబించింది. ఆమె రచనలు పశుప్రాయంగా కుదించబడ్డాయి. టింగుఅంగు విషాదగాథ కొలదిమంది కొమింటాంగు పీడకుల రహస్యసమాధిలో భద్రపరచబడుతుంది.

"పాన్‌చు-నేన్‌తోబాటు మే 14న క్విన్సాన్‌రోడ్‌లో ఆమెఇంటినుండి బలాత్కారంగా తీసికొనిపోబడింది. వీరిద్దరినీ ఆటోమొబైల్‌లో గొనిపోతుండగా ఇంటిలో పోరాటం

బయలుదేరింది. ఆపోరాటం ఇంగుషు-జాక్, మరోఅతను వారిని పట్టుకొన్న వారిమధ్య జరిగింది. ఆపోరాటంలో ఇంగు చంపబడి, నాల్గవకామ్రేడ్ తప్పించుకున్నారు. అతనిద్వారానే టింగ్ అంగ్, తదితరుల పరిస్థితినిగూర్చి ప్రపంచం గ్రహించ గలిగింది. అతనిద్వారానే బలాత్కారానికి, హత్యకుకారకు లైన ఆఫీసర్లు నాంకింగ్‌లోని "బ్లూజాకెట్స్" సంస్థ ప్రత్యేక అధ్వర్యాన నడుపబడే షాంపై ప్రజాశాంతి భద్రతబ్యూరో ఆఫీసర్లని తెలుసుకున్నాం.

......మే దినోత్సవంనుండి చాలమంది స్త్రీ పురుషులు కనబడుటలేదు. వారి చిహ్నాలుగూడ కానరావడంలేదు... అంతేగాకుండా, బ్లూజాకెట్స్, దాని కార్యకలాపాలేవీ బయ ల్పడకుండా ఉండాలనే నీతిగల సామ్రాజ్యవాద పోలీసుల అను మతితో, వారితో పరోక్ష, మూకీభావ సంబంధాలు పోసగు తున్న ఇంటర్నేషనల్ సెటిల్‌మెంటుకు భిన్నంగా ప్రవర్తిస్తు న్నారని మేం ఆరోపిస్తున్నాం. టింగ్ అంగ్ హత్యగావింప బడిందా?......టింగ్ అంగ్, పాన్ చు-నేన్ తదితరఖైదీలను విడుదలచేయువలసిందిగా మేం డిమాండు చేస్తున్నాం......"

5 సంవత్సరముల తరువాత టింగ్ అంగ్ విడుదల చేయ బడింది. ఆమె వెంటనే శత్రుశ్రేణుల వెనుకభాగానికి వెళ్లి అచటి గెరిల్లాలతో పనిచేసింది. అక్కడ ఆమె యుద్ధరంగనాటక దళాన్ని సంఘటితపరచి సైనికులను, రెడార్మీ అష్టమసైన్యం (8th Route Army) విముక్తిగావించిన ప్రజలను నాటకాలు, పాటలువినిపించేవారు. దేశప్రయోజనాల కొరకు స్వార్థచింతన, సర్వంత్యజించిన, చైనారచయితలలో ప్రథములు. ఆమెజీవి

తమే కష్టభూయిష్టం. ఆమె నాటకసమాజం వందలకొలది మైళ్ళు ప్రయాణంచేసి కొద్దినెలల్లోనే 80 లక్షలమంది ప్రజలకు తమ ప్రదర్శనలిచ్చారు. సైనికజీవిత కాఠిన్యత, చాలీచాలని రేషన్లతో జీవనం గడిపేవారు. ఈకష్టాలన్నిటికీ ఉపశాంతి వారుటూరింగుకై వచ్చినప్పుడు ప్రజలువారిని అభినందించడమే మహదానందం. ఆమె ఒకసారి అన్నా లూయీ స్ట్రాంగుకు యిలాచెప్పింది.

"మేం యీప్రమాద మృత్యుకోరలనుండి వచ్చినప్పటికే మా ప్రేక్షకులు చిరునగవుతో మమ్ముల నాహ్వానిస్తారు. అందుచేత మేమూ ఆనందంతో ఉంటాం." చైనాసారస్వతంలో కొన్ని నూతనపోకడలను గూర్చి వివరించడమేమనగా ఆమె యిచ్చిన సమాధానమిది." యుద్ధరంగానికివచ్చి 6 నెలలయింది. కాబట్టి పోకడలంటూ నాకు తెలియవు. కాని రచయిత కర్తవ్యం గూర్చి నాకు స్పష్టమైన అభిప్రాయముంది. అతనికొక్కే ఒక బాధ్యతవుంది. దేశాన్ని రక్షించుటకై సహాయపడటం. సాహిత్య సిద్ధాంతాలతో తల్లకిందులు గావలసిన అవసరం లేదు. ప్రజల నుత్తేజపర్చుటకు మాత్రమే మనం వ్రాయాలి.

యుద్ధారంభంనుండి ఒక చిన్నకథలపుస్తకాన్ని రచించింది. శత్రుశ్రేణుల వెనుక గెరిల్లాలతో ఉన్నపుడు "నేను షాచువాన్"లో ఉన్నప్పుడు (When I was in Sha Chuan) అనే పుస్తకాన్ని రచించింది.

మరోరచయిత్రి హిసిమోహంగు. టీఃచున్ అనే రచయితభార్య. తదితరవిప్లవ రచయితలలో పాయువే, ట్సావో మింగు, మేపింగు యింగు వున్నారు. వాస్తవికవిధానంతో రైతు జీవితాన్ని చక్కగా వివరించగల రచయిత్రి కోన్చింకు. రైతుల

మనస్తత్వాన్ని, ఉత్తేజాన్ని చిత్రించడంలో ప్రావీణ్యత నందింది. ఆమె జమీందారీ కుటుంబంలో పుట్టినప్పటికీ యుద్ధానికి పూర్వం షాంఘైలోని ఫ్యాక్టరీ కార్మికస్త్రీలతో పనిచేసింది. ప్రస్తుతం క్వీఅంగులో కమ్యూనిష్టుఅయిన తనభర్తతో నివ సిస్తున్నది. ఆమెకు ఇద్దరుబిడ్డలు. తన రచనలతోబాటు టీచ రుగా గూడ పనిచేస్తుంది. ఇండియాలో మాదిరిగా చైనాలో గూడ చాలతక్కువ జీతాలు యివ్వడం మూలంగా, ఆమె రచ నలపై ఆదాయం లేకపోయినకారణంగా ఆమెచాల బీదస్త్రీ. చాలమంది రచయితలు ఆమెరచనలను మెచ్చుకుంటారు. రైతుజీవితమును చిత్రించే రచయితలలో ప్రముఖురాలుగా పరి గణిస్తారు.

ఈపుస్తకానికి ఉపోద్ఘాతంవ్రాసిన యాంగుకాంగు ప్రసి ద్ధినందిన స్త్రీలలో ఒకామె. ఆమె హార్వార్డ్‌యూనివర్సిటీ యొక్క స్కాలర్షిప్‌పై/ అమెరికాలో ఆధునిక సాహిత్యాన్ని గూర్చిఅధ్యయనంచేయుటకు ఇండియా మీదుగావెళ్లింది. ఆమె చైనాదినపత్రిక "టాకుంగుపావో"కు సాహిత్యసంపాదకురాలు.

ఆమెచాలా బక్కగా పాలిపోయివుంటుంది. చుంకింగులో మిన్నంటే ధరలుగల ఆహారపదార్థాల కొరతకారణంగా ఆమె చాల అనారోగ్యంగా వున్నట్లు గోచరిస్తుంది. సున్నిత దృక్కులైనా గంభీరవదనం. ఆకర్షికవదనం. పూర్తి పరిజ్ఞానం గల యువతి. ఎంతగానో బాధలుపడవలసివచ్చింది. అయినా ఆమెకు దిగులూ విచారంగాని లేక నిశ్చింతగా సహించింది. ఆబాధా సహిష్ణతయే ప్రతి రచయితకూ అత్యవసరమైన

మానవ స్వభావ పరిజ్ఞానాన్ని చేకూర్చింది. ఇండియా యెడల ఆమెకుగల పరిజ్ఞానం, ప్రేమ అవ్యాజమైనట్టివి.

యాంగుకాంగు అధికారం మాండారిన్ కుటుంబంనుండి వచ్చింది. 17 సంవత్సరాల వయస్సువరకు, తరువాత అమెరికన్ మిషన్‌స్కూలుకు పంపబడేవరకు ఆమె ప్రాథమికవిద్య నభ్యసించింది. ఆమె యింకా స్కూలులో వున్నప్పుడే 1927 లో గొప్ప విప్లవం బయలుదేరింది. ఆమె నివసిస్తున్న నాన్ చాంగు, చాంగ్సీ రాష్ట్రపు రాజధానీ నగరం, నేషనలిస్టుసైన్యాలచే ముట్టడించబడింది. ఆమె అంటుంది : "ఆసమయంలో ఉత్తరదేశ యుద్ధప్రభువుల్ని తరిమివేయుటకు తరలివస్తున్న సదరన్ రివల్యూషనరీ ఆర్మీని (దక్షిణవిప్లవసైన్యం.) గూర్చి మాత్రమే నాకు తెలుసు. యుద్ధప్రభువులంటే నేను అమితంగా ద్వేషిస్తాను, అందువల్లనే విప్లవం సరియైనదని నేను భావించుకోగలిగాను. నేషనలిస్టుసైన్యాలు ప్రకటించిన కరపత్రాలు నన్ను మరింత సుదీర్ఘంగా ఆలోచింప జేసినాయి. దానిని గూర్చిగూడ మాతండ్రిని నేనడిగాను. మాతండ్రి ఉత్తరదేశ యుద్ధప్రభువులక్రింద ఒకగొప్ప ఉద్యోగి. ఆతరువాత నేను నేషనలిస్టులు ప్రకటించిన సాహిత్యాన్ని పూర్తిగాచదివి ఇంకా ఎక్కువగా సమ్మోహితురాలనయ్యాను. మాస్కూలుకుప్రక్కనే అమెరికన్ హాస్పటలు వుంది. అక్కడే నాకు నేషనలిస్టు సైనికులతో పరిచయం కలిగింది. వారు పోరాడేది దేనికొరకో నేను వెంటనే గ్రహించగలిగాను. అదే నన్ను ఎక్కువగా ఉత్సాహపర్చింది. క్రమక్రమంగా నేను విప్లవంవైపుకు మొగ్గుతూవచ్చాను. ఆసమయంలోనే నాకు పిడుగులాంటిదెబ్బ తగి

లింది. మాతంగ్రిడిగారిని రైతులు అరెస్టుచేశారని టెలిగ్రాం వచ్చింది. ఈవార్త నన్ను ఎంతో క్షోభపెట్టింది. ఎందువల్లనంటే నాకు మాతంగ్రిడిఅంటే ఎంతో ప్రేమ. ఉద్యోగి అయినప్పటికీ, మాతంగ్రిడి అవినీతిపరుడుగాదనీ, లంచగొండిగాదనీ, అంతేగాక చాల దయాహృదయుడనీ, గొప్పపండితుడు, కవి అనీ నాకు తెలుసు. కాని రైతులు అలాంటి ఉత్తమమానవుని ఎందుకు అరెస్టుచేశారో నాకు బోధపడలేదు. నాస్కూలు జీవితానికి స్వస్తిచెప్పి నేను యింటికి బయలుదేరాను. నేను బయలుదేరకముందు వాంగ్ చెంగ్ వేయ్ (తరువాత జపానుతొత్తుగా మారాడు)కు నావ్రేలి రక్తంతోనే ఒకజాబు లిఖించాను. నేను యింటికివెళ్లిన తరువాత మాతంగ్రిడిగారితరఫున వాదించుటకై నన్ను వాంగ్ చంగ్ వేయ్ దగ్గరకు గొనిపోయారు. మాతంగ్రిడి ఉత్తమమానవుడని నేను వాదించాను. మాతంగ్రిడిని హత్యగావించాలని కోరుతున్నది కమ్యూనిస్టులేనని అతడు, అతని భార్య నాకు వివరించారు. అప్పట్లో పూర్తిగా యిక కమ్యూనిస్టులను నేను ద్వేషించాను. అంతేగాదు. కొమింటాంగ్ సైన్యంలో చేరడానికిగూడ ఉబలాటపడ్డాను. కాని ఆకాలంలో నాకు ప్రజాఉద్యమంతోను, సుసంఘటితులైన కార్మికులతోను పరిచయం కలిగింది. వారిసభలకు హాజరైనాను. కార్మికులే స్వయంగా యిచ్చిన ఉపన్యాసాలను విన్నాను. అంటే వారు అంత నిజాయితీ, ఆత్మవిశ్వాసం కలిగియున్నారన్నమాట. అంత మురికిగబ్బుగొడుతూ, అణగారిన పీడు అమాంతం మారిపోయారా అనిపించింది. వారిలోగల నవీన చైతన్యం నన్ను మేల్కొలిపింది. రానురాను నేనూ వారి

వైపుకే, నాహృదయం వారివైపుకే ఈడ్వబడినాయి. రాజకీయ గ్రంథాలను పఠించడం, కార్మికసమస్యలను గంభీరంగా అధ్యయనం చేయడం ప్రారంభించాను.

ఆతరువాత కొమింటాంగ్-కమ్యూనిస్టు భేదాలు పొడసూపినాయి. అప్పుడే మాతండ్రిగారి విడుదలగూడ జరిగింది. ఆనాడుమాత్రమే మాతండ్రి ప్రజల్ని త్రొక్కిపెట్టియుంచిన వర్గానికే సైద్ధాంతికంగా చెందియున్నాడని అర్థంచేసుకోగలిగాను. మాతండ్రిగారి విడుదల అంటే దేశంలో అభివృద్ధి నిరోధక శక్తులు తలెత్తుతున్నాయని స్పష్టంగా బోధపడుతుంది. మాతండ్రి భద్రతను నేను అభిలషించినప్పటికీ, చైనాదౌర్భాగ్యానికి నేను ఎంతో వగచాను. ఈమాసాల్లో నామనస్సులో గొప్ప వైరుధ్యం బయలుదేరింది. నేను కార్మికుల్లో పూర్తిగా లీనమైపోయాను. నన్ను పూర్తిగా వారికి అర్పితమైనట్లు, సముద్రంలాగా మరల తిరిగి వారినుండి అదే భావోద్రేకం నాలో ప్రవహింపజేసినట్లు భావించాను. వేలాది, లక్షలాది ప్రేక్షకుల మహాసభలలో చైనాలో గొప్పమహత్తర వైపరీత్యం జరుగుతున్నట్లుగా భావించేదాన్ని. చైనా భూదేవియే విప్లవగర్జనలు చేస్తోంది. ప్రతిరాత్రి మృత్యుకోరలలోనికి లారీలనిండా గొనిపోయే యువతీయువకులను చూచేదాన్ని. ఆలారీలు పయనం చేస్తున్నప్పుడెల్లా నేను నిద్రించేదాన్నికాదు. మృతజీవుల్ని భూగర్భంలోనుండి తిరిగి సజీవులుగా పైకి తీసికొని రావాలని నేను ఉత్సుకపడుతుండేదాన్ని.

నేను, మేధావులకు సంబంధించిన నవలలు, చిన్నకథలు, పద్యకావ్యాలు, వారిజీవితం, పోరాటం, వారి మానసిక పోక

డలు, వారి అనుమానాలు, రాజకీయాభిప్రాయాలనుగూర్చి వ్రాశాను.

వీటిలో ఒకనవల, చిన్నతనంలోనే ఒక భూస్వామి కుటుంబంవారికి కోడలుగా అమ్మివేయబడి, ఆకుటుంబంలో పిచ్చివాడైన మూడవ కుమారునికి వివాహంచేయబడిన ఒక సుందర రైతుస్త్రీ గాధను వర్ణిస్తుంది. ఆమెభర్త వ్రణంతో బాధపడేవాడు. ఆమె ఒక అందగత్తె, బలిష్ఠురాలు. వివాహం కాకముందు పొడగ్గరి, బలీయుడైనవాడు తనకు భర్త కావాలని అభిలషించింది. భూస్వామి యింటిలో అలాంటిపురుషు డొకడు తిరుగాడటం గమనించింది. ఇక ఆమె మనస్సులో అతని మూర్తి హత్తుకునిపోయింది. అతడే తనకు వరుడు గాబోలునని తలచింది. కాని అతడు ఆభూస్వామి యింటి వ్యవసాయదారు డని తేలింది. ఆ పురుషుని వలచిందిగాని అతనితో సంభాషించడానికి సాహసించలేకపోయింది. తరువాత ఆమెభర్త చనిపోతాడు. మామ ఆమెను చెరిచి ఒక బిడ్డను కలగిస్తాడు. ఆ భూస్వామినైతే ద్వేషించిందిగాని ఆబిడ్డను, ఆ వ్యవసాయదారుని ప్రేమిస్తుంది. పొలాల్లో యిద్దరూకలసి పనిచేసేవారు. ఒకనాడు ఒకరికొకరు తమ ప్రేమను వెల్లడించుకున్నారు. భూస్వామి యిది గమనించి ఆమెను చచ్చేపర్యంతం తీవ్రంగా కొట్టాడు. భూస్వామికి ఎల్లప్పుడూ ఋణపడి యుండేలాగా ఆ యువరైతును ఒక చవిటిపొలాన్ని సాగుచేయుటకు కౌలుదారుగా పంపాడు. భూస్వామి వదలేసిన పరిచారిక నొకదానిని వివాహమాడవలెనని అతన్ని బలవంత పెడతాడు. ఆ యువ రైతు వరదల మూలంగా నష్టపరచబడ్డాడు. ఆమె బిడ్డను

నదిలో త్రోశారు. ఇన్నికష్టాలు వచ్చినా, అతను ఖైదీచేయ బడినా, ఆమె మాత్రం అతడు తిరిగి తనను చేరుకుంటాడనే ఎదురుచూస్తుంది.

"తరువాత నేను షాంఘైకు పోయి చదువుతునే "ప్రైడ్ అండ్ ప్రెజుడిస్"లాంటి గ్రంథాలను అనువదించాను. లూహసన్‌తో నూతన వైజ్ఞానిక ఉద్యమంలోచేరి మే ఫోర్తు ఉద్యమం నాటినుండి ఉద్భవించిన ఆధునిక సారస్వతాన్ని అధ్యయనంచేశాను. నేను హాంగ్‌కాంగ్‌లో వుండేదాన్ని. కాని జపాను వాళ్లకు అది లొంగిపోగానే 2,00,000 పదాలుగల 'ట్విలైట్' అనేనవలావ్రాతప్రతిని, ఒక నాలుగంకాల నాటకాన్ని వదలి పారిపోవలసివచ్చింది. ఒక రైతు స్త్రీవేషంలో నేను తప్పించుకొని కొన్నినెలల వరకు క్వాంగు - టంగులో గెరిల్లాగా వున్నాను. ఇక్కడ గెరిల్లాలు కమ్యూనిష్టు నాయకత్వంలో వున్నారు. కాంటన్‌కు, హాంగు-కాంగుకు మధ్య వార్తా సౌకర్యాలను త్రెంచివేయడమే పనిగా పెట్టారు. రైతులకు చదవడం వ్రాయడం నేర్పారు. తరువాత చుంకింగుకు వెళ్ళి "టాకుంగు పోవో"వారిని కలుసుకున్నాను.

యాంగుకాంగు ఇండియా, ఇండియాప్రజలతో గాఢ మైత్రి నేర్పరచుకొన్నది. చైనాస్త్రీలను, ఇండియాస్త్రీలకు సాపత్యం చేస్తూ ఆమె యిలా అన్నది.

"చైనా స్త్రీకంటె భారతీయ యువతి తన మృదులత్వ కారణంగా ఎక్కువ ఆకర్షణీయమైనదని నేను తలంచుతాను. మీా స్త్రీలు మృదుల సౌకుమార్య సుందరపురుషుల్ని సృష్టించే ఘడియలువస్తాయి. దానికై విచారపడ నవసరంలేదు. మీా స్త్రీ

లకు ఎక్కువశక్తి సామర్థ్యాలు, ఆధ్యాత్మిక శక్తి కలదని నేను గమనించాను. వారు మంచి అని అనుకున్న దానివిషయంలో పురుషులకంటె ఎక్కువ శక్తివంతులు. ఇండియా వాక్యపూరత కంటె కార్యపూరత్వం వాంఛిస్తూంది. మీ యువజనుల్లో అధిక సంఖ్యాకులలో మాటలతోనే గెలిచేస్తామనే ఆలోచనా, ఫోకడవుంది. అదేనిజమైతే యీ సరికి ప్రపంచమంతా స్వర్గమై యుండేది."

మరో యువతి, "విప్లవప్రతీఘాతం" అనే అధ్యాయంలో జీవితచరిత్ర వివరణ వ్రాయబడిన పీపింగుయింగు యుద్ధారంగం నుండిజాబులు అనేకం వ్రాసింది. అవి "ఒక చైనా ధీరయువతి లేఖలు" అన్నపేరుతో లిన్‌యుటాంగుచే అనువదించబడ్డాయి. ఆమె బహుశా చైనాలోని నలుగురు ప్రవిద్ధస్త్రీ రచయితలలో వకామె. 1927 కు పూర్వమే ఆమెజాతీయ సైన్యంలో చేరింది. స్త్రీసైన్యాన్ని రద్దుచేసిన తరువాత ఆమెయింటిలోనే బంధించబడినపుడు చాలబాధపడింది. ఆమె పుట్టుకనుండే ఆమె కొరకు కుదిర్చినసంబంధాన్ని మాత్రమేవివాహమాడితీరాలని ఆమెతల్లిదండ్రులు మొండిపట్లు వహించారు. ఆమె ఏమి చెప్పినా వారి మనస్సులు మారలేదు. పైగా వకగదిలో పెట్టి తాళం వేశారు. ఆసమయంలో ఆమె ఆత్మహత్యకు ఒడిగట్టాలని అభిప్రాయపడింది. "మరణం మినహా మరోగత్యంతరం నాకు తోచలేదు ......చావు! చావుగాక మరేదిన్కా ఏమైనావుందా? మనుగడకొరకు పోరాడటం మానవుని సహజలక్షణం. అలాంటపుడు నేను ఎందుకు మరణించాలి? మహాసముద్రంలో ఇసుకరేణువునైన నేను మరణించినందువల్ల ఆమహాసముద్రా

నికేమాత్రం మొప్పంరాదు. అది నా పిరికితనానికి క్షమా పణమాత్రింగాదు......అంతేగాకుండా నేను విప్లవమతాన్ని పుచ్చుకొన్నాననీ, సమాజాన్ని సంస్కరించే బాధ్యత అప్ప గించబడిందనీ నేను స్మరించుకోవాలి. నేనొక యోధురాలుగా చేయబడ్డాను. యుద్ధరంగంలో పోరాడే భాగ్యం అబ్బింది. 1, 25, 00, 00, 000 మంది అణగారిన మానవమాత్రుల విముక్తికై కడవరకు పోరాడుతానని శపథం తీసికొన్నాను... ...అసహ్యాకరమైన పురాతన పద్ధతికి వ్యతిరేకంగా పోరాడ టమే నాకర్తవ్యం. ఒక్కసారిగా ఆబాధ్యతలన్నిటినీ ఎలా మర్చిపోగలను.? నేను చావడమంటే నేను ఓడిపోయి పురా తనపద్ధతి విజయం సాధించిన దన్నమాట. పురాతన సమాజం ఒక పెనుభూతం. అది అనేకమంది ప్రజలను పీల్చి పిప్పిచేసింది. ఇంకా తన వెడల్పైన రక్తసిక్త గహ్వారాన్ని చాలినంత సాహ సంగేని యువజనులను మ్రింగడానికి చాచుతోంది......జీవ న్మరణములమధ్య యిలాంటి సంఘర్షణ బయలుదేరి కడకు జీవితమే విజయం పొందింది."

అవును జీవితమె విజయం సాధించింది. తన ఖైదునుండి బయటపడుటకై మూడుపర్యాయములు విఫలప్రయత్నములు చేసింది. నాల్గవపర్యాయం ప్రయత్నంలో గెలుపొంది తాను తప్పించుకొన్నపుడు యీక్రింది సాహసిక, మధురగీతాన్ని రచిం చింది.

"ఓ 'నా మాతృదేశమా' ఇదే వీడ్కోలు;
పచ్చపచ్చని పర్వతాల సౌందర్య రాశి,
సతతము ధ్వనించెడి నీటి గర్జనలతో;
'పీచ్', 'ఆప్రికాట్' ఫలవృక్షములు నీకు చిత్తరువులై.
దారాలవలె వ్రేలాడు 'విల్లో'లతో,

*　　　*　　　*

ఓ! నా సౌందర్య మాతృభూమీ !
నా శైశవహృదిని మత్తెక్కించినావు,
రక్త సిక్తచారలు తక్క నాహృదిపై
మరేది నిలచిలేదు.

*　　　*　　　*

పురాతన బూజు విధాన మొక గండ్రపులి
అంధకారమయుల నిట్టే కబళిస్తుంది.
పోరాటం ! పోరాటం !
ఎల్లెడలా విజయసాధక మదాక్కటే.

———

# వీడ్కోలిదె, నా మాతృదేశమా!



ఖైదులో జపం పూర్తిఅయినతరువాత ఆమె జపానుకు వెళ్లి అక్కడే అధ్యయనం, రచన కొనసాగించింది. కాని ఒక నాడు టోకియో పోలీసులు ఆమె గదిపై దాడిజరిపి 80 వేల పదాలుగల ఒక వ్రాతప్రతిని "యూనివర్సిటీజీవితం"ను పట్టు కెళ్లారు. దానిని ఆమె మరల ఎన్నటికీ తిరిగి వ్రాయలేక పోయింది. దానికి ఆమె యిలా చెప్తుంది, "నాకొక విచిత్ర స్వభావముంది. నేను వ్రాసేది ఆరంభించితే తుదిచూడాలి. ఒకవేళ వ్రాతప్రతిపోతే తిరిగి దానిలోని విషయాలను వ్రాసే దానికంటె ఆకాశానికి ఎక్కడమే నాకు సుగమంగా గోచ రిస్తుంది." ఆమెమరో గ్రంథాన్ని ప్రచురించింది. దానిపేరు"హ్యూ నాన్ వాయువు" (The Wind of Hunan) హ్యూనాన్ ఆమె స్వరాష్ట్రం.

కొన్ని సంవత్సరాలతర్వాత ఆమె తన సైనిక జీవితాన్ని గూర్చి యిలా వ్రాసింది.

"ఓ సంవత్సరాల క్రితపు సుదినమా! దాని స్మరణమే నన్నుకలతపెడుతుంది. ఒకమాటు యాభైమంది సుదృఢ యువతీ యువకులు జీవిత యాదార్థ్యాన్ని సాధించుటకొరకు పురోగమ

నం సాగిస్తూ షువా–యూయే జిల్లా రాచబాటపై కదంద్రొక్కుతూ పదం పాడారు. సుడిగాలి వీచింది. కుంభవర్షం కురిసింది. అయినా అవేమీ కష్టాలుగా కనిపించలేదు. రేపటిదినం నులివెచ్చని ప్రశాంతి, సూర్యకాంతిగల దినమని మాత్రమే మేం భావించుకున్నాం. మా ముందర చక్కని రహదారులు, సుందరనందనోద్యానాలు మాత్రమే కానిపిస్తున్నాయి......"

అందరికీ నందనోద్యానములు, చక్కనిబాటలు లభించే రోజు తప్పక వస్తుంది. శ్రీమంతులతో సమాన స్థాయి, సమానహక్కు సాధించుటకై చైనా రచయితలుచేసిన త్యాగాలు, జీవిత మధురత్వం ఎన్నటికీ వృధాకావు.

మనం ప్రజలం, పీడిత ప్రజలం–
మనం పోరాడాలి.
సంకెళ్ళను తెగత్రెంచ పోరాడు, శాంతివిజయం కొరకు పోరు,
సోదరులారా ! సాయుధులుకండి. మేల్కొనండి !

---

# దీర్ఘ యాత్ర



1929 - 32 జపానీయులు దక్షిణమంచూరియాపై మిలిటరీ కంట్రోలు ఏర్పరచుతారు.

1932 జపానువారు షాంఘై పై దాడిజరిపి ఇంకా ఎక్కువభూభాగాన్ని సంపాదించుకుంటారు.

1933 కొమింటాంగు జపానుతో శాంతిసంధిచేసికొంటుంది. జెహోల్, తదితర ఉత్తరచైనా ప్రాంతాలు జపానుకు సంక్రమిస్తాయి,

పైన వివరించబడిన సంఘటనలు దేశభక్తులైన వారికందరికీ, జపాను దురాక్రమణదారుల్ని ద్వేషించేవారికి చైనాలో అంతర్గత పరిస్థితి ఎంత ప్రమాదంగా వుందో బోధపడుతుంది. చైనా కమ్యూనిష్టులతో వున్న విభేదాలను పరిష్కరించుకోకుండా ప్రాంతం తరువాత ప్రాంతం జపానుకు అప్పగించిన నాంకింగు ప్రభుత్వ విధానాన్ని, కియాంగ్సీరాష్ట్ర "బందిపోట్లు" కమ్యూనిష్టులుమాత్రమే ఎల్లప్పుడూ ఎదిరించారు. కొమింటాంగు, 1933లో "బందిపోట్లు" జపానుకు వ్యతిరేకంగా సంయుక్త యుద్ధాన్ని కొనసాగించుటకు, కమ్యూనిష్టు భూభాగాల పై కొమింటాంగు అంతర్యుద్ధాన్ని విరమించుటకు చేసిన విజ్ఞాపనను ప్రకటించలేక పోతుంది.

"జపానీయులు పశ్చిమోత్తర చైనాను ఉలికిస్తూన్నారు. కొమింటాంగునుండి ఏ జబాబులేదు. కియాంగ్సీలోని కమ్యూనిస్టుల పరిస్థితి ఘోరప్రమాదంగా సంభవించింది. అప్పుడు వెంటనే రెడార్మీ చైనాయొక్క వ్యూహాత్మకమైన ఆ కోణానికి, పశ్చిమోత్తరానికి, శత్రుభూభాగాల మీదుగానే ఆరువేల మైళ్లు యాత్రజేయ నిశ్చయించింది.

అక్టోబరు 15, 1934 న, చైనారెడార్మీ, రెడార్మీ సానుభూతి పరుల ప్రసిద్ధ దీర్ఘయాత్ర పశ్చిమోత్తరానికి తరలింది. ......స్వాతంత్రోద్యమ చరిత్రలో చరిత్రాత్మక సంఘటన అది. మానవుని సహనానికి, పవిత్రాశయంలో అతనికి గల అచంచలత్వానికి అది అత్యంత ఉచ్ఛరూపం. ఆరువేలమైళ్లు. సుదీర్ఘయాత్ర, ప్రపంచంలోకెల్లా ఘోరఅడవుల ప్రాంతందాటి 18 పర్వతపంక్తులు, 24 నదులను అధిగమించి, పదిమంది యుద్ధ ప్రభువుల ప్రాంతాలమధ్యగా, ఆదిమవాసుల ఆరు జిల్లాలగుండా, 64 పట్టణాలను దాటి యీ యువతీ యువకుల సైన్యం తమ్మెదిరించిన ప్రభుత్వసైన్యాలను ప్రతిఘటించుతూ సామ్రాజ్యవాదులు పంపిన బాంబరు విమానాలను ఢీకొంటూ కదలిపోయారు. అయినా, వారుమాత్రం తమ గమ్యస్థానాన్ని, ఉత్తరషెన్సీకి, 368 రోజులు ధీర్ఘయాత్ర తరువాత చావగా బ్రతికియున్న 20,000 మందితో చేరుకోగలిగారు.

ఈ యాత్రలో పాల్గొన్న స్త్రీలకు సంబంధించి నంతవరకు మంచుమయ పర్వతాలను, సుడులుతిరిగినభయంకర నదులను దాటుతూ యాత్రజరిపిన స్త్రీలకు సంబంధించినంతవరకు మనం మాట్లాడుదాం. కమాండరు హౌక్సేచున్, సున్నిత

హృదయురాలు, చైనాకమ్యూనిస్టుల నాయకుడైన మావోసే టుంగ్ భార్య, అయన చైనాలో ప్రఖ్యాతపురుషుల్లో ఒకరు. అంతేకాదు, ప్రపంచములో కెల్లా అత్యంతవిజ్ఞానవంతుల్లో ఒక డుగా పరిగణించబడుతాడు. హూకేన్సచున్ రెడ్‌ఆర్మీలో 10 సం వత్సరాలు పనిచేసింది. ఆమెకు అనేకరకాలపనులు, స్త్రీలను సైన్యంలో సంఘటితపర్చడం, గాయపడ్డవారికి శుశ్రూషచేయ డం తన దుర్బలమైన భుజాలపై గాయపడినవారిని, రోగుల్ని మోయడం, అనేకయుద్ధాలలో చురుకుగా పాల్గొనడం వగైరా అమె వంటినిండా 20తీవ్రగాయాలతో, అందులో 8 గాయాలు ప్రమాదకరంగా వుండగానే దీర్ఘయాత్రలో బయలుదేరింది. పైగా గర్భిణి. అంతకన్నా అత్యంతవిషాదకరవిషయ మేమంటే ఆయాత్రలో కల్గిన బిడ్డను తనవెనుకనే వదిలివేసి బయలుదేర డం. ఆ ముక్కుపచ్చలారని పసికందును, సంరక్షిస్తామని వాగ్దానమిచ్చిన రైతులవద్ద వదలివేసింది. ఆకన్నబిడ్డ పోలిక లను ఊహించుకొనుటకు ఎన్ని ప్రయత్నాలు చేసినా విఫల మయింది. ప్రస్తుతం హూకేన్సచున్ మాస్కోలో శానిటోరి యంలో నయంకాని సుదీర్ఘవ్యాధికి చికిత్స నందుతోంది. తన దేశసేవలో ఆమె తన ఆరోగ్యాన్ని, జీవితాన్ని అంకితంచేసింది. టెంగ్‌లిన్‌చౌ, (మదాంచౌఎన్‌లై) అష్టమ రెడ్‌ఆర్మీ కమాం డరుభార్య, 1919నుండి విద్యార్థి విప్లవనాయకురాలు, ఆ సం వత్సరములో విద్యార్థుల తిరుగుబాటుకారణంగా టీన్ట్సెన్‌లో ఖైదుచేయబడింది. జైలులోపలనే ఆమె, మొదట విప్లవ విద్యా ర్థిగా వుండి ప్రస్తుతం చైనా కమ్యూనిస్టుల నాయకుల్లో ఒకరైన తన భర్తను కలుసుకుంది; లాంగుమార్చికిముందు ఆమె

క్షయవ్యాధితో బాధపడుతుండేది. నాలుగుమాసాలు స్ట్రె చరుపై మోసుకొనిపోవలసివచ్చినా 6000 మైళ్ళలో తక్కిన భాగమంతా కాలినడకనే ప్రయాణం సాగించింది. ఆమె అన్నాలూయీ స్ట్రాంగుకు లాంగుమార్చ్ గాధ వివరించింది.

“మేం ఒకచోట ఆగి మామూలునతున్న సంచులు దింపగానే స్త్రీలు సభలు ఏర్పాటుచేశారు. మనదేశంపై జపాను వాళ్లు దురాక్రమణ జరిపారనీ, మేము పశ్చిమోత్తరానికి జపానుతో పోరాడుటకై వెళ్లుతున్నామనీ వివరించారు. ఆప్రజలకు, స్థానికప్రజలకు స్థానికంగావుండే లంచగొండి అవినీతిపరుల్ని, మోసపు పెద్దమనుష్యుల్ని అరెస్టుచేయడంలో సహాయపడ్డాం. రెడ్‌క్రాస్ కార్యక్రమమే కఠినతరమైనది. గాయపడినవారిని మోసేవారికి తీరిక, విశ్రాంతి దుర్లభమయ్యేది. ......10 సంవత్సరాలు, అంతకులోపు వయసుగల దాదాపు వందమంది బాలబాలికలుగూడ ఆ యాత్రలో వున్నారు. ప్రతి ఒక్కరూ తమ సామానులను తామే మోసుకొనేవారు. తమ ఉపహారంగా నాటకాలలోను, పాటలక్రమంలోను వారుగూడ పాల్గొనేవారు. వారిలో కొంతమంది చాల దుర్బలులు అయిపోవడంచేత అనేకచోట్ల వారిని వదలివేశారు. కాని తక్కినమంది మాత్రం యాత్రకడవరకు ప్రయాణంచేశారు. వారు అష్టమ రెడార్మీలో చురుకుగా పనిచేస్తున్నారు. లాంగ్‌మార్చ్‌లో 80 మంది శిశువులు జన్మించారు. నలుగురు నేను పయనించిన ప్రథమసైన్యంలోనే—ఒక మగపిల్లవాడు, ముగ్గురు ఆడపిల్లలు. తల్లులందరూ తమ బిడ్డలను వెనుకవిడిచిపెట్టి తమ [illegible] కూడకు కొనసాగించారు. రెండవ సైన్యంలో జన్మిం

చీన నలుగురు శిశువులు అదృష్టవంతులు. వారందరూ యాత్రే చివరిదశలో, సంరక్షించేవారు లేనిచోట జన్మించారు. అందు వల్ల సైన్యం వారిని వెంటగొనిపోయింది. ఆహారంగాని, ఆశ్ర యంగాని లేనిచోట పచ్చికబయళ్లలో ఒక అమ్మాయి పుట్టింది. అందువల్ల ఆ అమ్మాయికి "లాంగ్‌మార్చ్" అని పేరుపెట్టారు. మరోఅబ్బాయి, కమాండర్ షేయోకే కుమా రుడుగూడ నిర్జనప్రదేశంలో పుట్టాడు. అతని జననమునకు ఆశ్రయంగా ఒక చిన్న మట్టిగుడిసె మాత్రం దొరికింది. అం దువల్ల అతనికి "లిటిల్‌మడ్‌హట్" అని పేరుపెట్టారు. శిశువు లందరూ బ్రతికి బాగానేవున్నారు.

ఆ కష్టపూరితమైన యాత్రలో టింగ్‌లన్ తనక్షయను ఎలా పోగొట్టుకొనగలిగిందో వివరించమని ఆమెను అన్నా లూయీస్ట్రాంగ్ కోరింది. దానికి ఆమె యిలా సమాధాన మిచ్చింది. "ఆనందమే నాజబ్బును నిర్మూలించింది."

"ఆనందమా? పలుకష్టాలుగావా!"

"కష్టాలేమిటి?"

"నీవు ఆకలితో పస్తుండలేదా?"

"చాలా తరచుగా. వరిచేలల్లో మేం గడ్డితప్ప తినేం దుకు ఏమీలేకుండా పదిరోజులున్నాం. అవును. మేం తర చుగా ఆకలితో వుండేవాళ్లం."

"అయితే నీకు అంత ఆనంద మెక్కడిది?"

"ఎందువల్లనంటే మా సమక్షాన ఆశాపూరిత, సువర్ణ భవిష్యత్తు వుంది. మేమందరం కలసే వున్నాం. సక్రమమైన మార్గాన్నే నిర్ణయించుకొన్నామనీ, కష్టాలన్నిటినీ అధిగమించ

గలమనీ మాకు తెలుసు. అనేక నూతనవిషయాలు చూచేం దుకు, వినేందుకున్నాయి.!"

ఎడ్గార్ స్నో 1937లో టింగ్ లిఙ-చౌయొక్క సాహసకృత్యాన్ని వర్ణిస్తూ తానుచూపిన చైనా స్త్రీలలో గొప్ప రాజకీయ ప్రతిభావంతుల్లో ఒక స్త్రీగా ప్రాధాన్యత నిచ్చాడు. జపానువారు పెకింగ్ పట్టణాన్ని ఆక్రమించినతరువాత ఒకరోజున టింగ్ లిఙ-చౌను ఎడ్గార్ స్నో కలుసుకున్నాడు. పడమటికొండల్లో వ్యాధి నయంచేయించుకుంటూండేది. జపానీయులు ఆమె నివసిస్తున్న స్థలానికి దగ్గరలో నున్న దేవాలయందరికి వచ్చే వరకు యుద్ధారంభమే తెలియదు. రైతు స్త్రీగా మారువేషంలో జపాను శ్రేణులగుండా తప్పించుకొనడానికి ఆమె తల ప్రాణం తోకకువచ్చింది. పెకింగ్ నువదలి పశ్చిమోత్తరానికి వెళ్లుటకు నిశ్చయించుకొంది. కాని జపానీయులు పట్టణంనుండి పోయే చైనా ప్రయాణీకుల్ని సోదాచేసేవారు. ఏమాత్రం దూరదృష్టి సారించియున్న ప్రతివారినీ "ప్రమాదకర ఆలోచనలు" గలవారిగా పరిగణించి పట్టుకుపోయేవారు. ఇక వారి సంగతి అతీగతీ వుండదు.

అందువలన లిఙ-చౌ, ఎడ్గార్ స్నో కుటుంబ పరిచారికగా తిరుపాయి బండిలోనే ప్రయాణంచేయాలని నిర్ణయించబడింది. ఆమె, ఒక అమాయక ఆయాలాగా నటించడంలో విజయవంతమైంది. అనేకమంది విద్యార్థినులు క్రాపుజుత్తువున్న దనే నెపంతోగాని లేక వారి రైతువేషాలు బయల్పడినవారు పట్టుబడిపోవడం వారుగమనించారు.

ఇక మదాంభూలే, కమాండరును రెండవభార్య, 1927కు పూర్వం ఆమె ఒక భూస్వామి వంటయింటి బానిస. గోవులకాపరి గూడాను. 1927లో ఆమె పారిపోయి స్త్రీవాన్‌గార్డుల ఆర్గనైజరుగా పనిచేసింది. ఆమె పెద్దపెద్దచేతులు, మగవారి మాదిరిగా పెద్దపెద్ద పాదాలుగల ఆజానుబాహువైతు స్త్రీ, ఒక వీరయోధు! శారీరకంగా గొప్పబలవంతురాలు, స్వారీచేయగలదు. అద్భుతంగా గురిపెట్టికాల్చగలదు. లాంగ్‌మార్చిలో ఆమెమూడువేల సాయుధ స్త్రీలకు నాయకత్వం వహించి తన స్త్రీవాన్‌గార్డుల రెండు రెజిమెంట్లతోనే శత్రుత్వసైన్యాల బ్రిగేడ్‌నంతటినీ నష్టపరిచింది. 1927 కు పూర్వం నిరక్షరకుక్షిగానున్న ఈ రైతుబిడ్డ రెండుసంవత్సరముల తరువాత యెనాఁ (సోవియట్) మిలిటరీ ఎకాడమీలో రాజకీయ విజ్ఞాన శాస్త్ర ఉపాధ్యాయినిగా 26 సంవత్సరముల ప్రాయంలోనే తయ్యారయింది. ఆమె యొక సహజ యోధురాలు. "నాకు స్వభావసిద్ధంగా పిల్లలంటే యిష్టం కాని నాకుమాత్రం అవసరం లేదు. సైన్యంలో నా బాధ్యతను నెరవేర్చటంకును, యోగ్యురాలుగా వుండాలి."

లాంగ్‌మార్చిలో పయనించ సాహసించిన కొద్ది మంది స్త్రీలు వీరు. దేశంపై జపానీయులు దండెత్తిన సమయంలో తమ గృహాల్ని, నూతన స్వతంత్రభావాలను పరిరక్షించుటకై మేల్కొన్న స్త్రీలలో అగ్రగాములువీరు. స్వేచ్ఛకై జరిపిన ఏపోరాటంలోను స్త్రీలు యింతటి మహత్తర సాహసాలను ప్రదర్శించలేదు.

---

# సంయుక్త సంఘటన



"కలిసిమెలిసి మనభారాన్ని ఈడుద్దాం,
కూడి, కలసి బరువు బాధల సహిద్దాం,
అందరం ముందుకే! అందరి పోరాట మొక్కటే;
స్వాతంత్ర్య రాచబాటపై కలసి కదంత్రొక్కుదాం."

—నేయ్‌మెరా "ది గ్రేట్ రోడ్." 1934

1936. జపాను దురాక్రమణ కొనసాగుతూనే వుంది. జపాను పీపింగ్ దగ్గర రైల్వేజంక్షన్ పట్టుకొంటుంది. నూతనజపాను అనుకూల ప్రభుత్వం పీపింగ్‌లో స్థాపించబడింది. పీపింగ్ విద్యార్థులు నూతన ప్రభుత్వంయెడ వ్యతిరేకప్రదర్శనలు కొనసాగిస్తారు.

1936. జపాను వ్యతిరేక యుద్ధప్రభువు, చాంగ్ లిపేయ్ లియాంగ్ జంగ్ కై షేక్‌ను ఎత్తుకొనిపోవడం. చైనాలో పార్టీలనన్నిటినీ ఐక్యపర్చగలవాడు జంగ్ కై షేక్‌యే గాబట్టి అతనిహత్యను చైనాకమ్యూనిస్టులు అరికడతారు. జపానుకు వ్యతిరేకంగా సంయుక్త సంఘటనకు కమ్యూనిస్టు – కొమింటాంగు ఒడంబడిక.

క్రమంగా, యీ గొప్ప వీరనారీమణులు అంకితంచేసిన ఆదర్శం వృష్టిని సంపాదించుకొంది. శత్రువు ప్రాంగణంలో వున్నప్పుడే చైనాప్రజలు అంతర్యుద్ధంతో అలసి సొలసి యున్నారు. జపాను దురాక్రమణకు వ్యతిరేకంగా ప్రతివక్కరినీ ఉత్తేజపరిచిన టింగుఅంగు, పీపింగు మొదలగువారి రచనలు వృథాపోలేదు. ఫాసిస్టు వ్యతిరేకభావాలు రోజుకోజుకూ పెరిగిపోతున్నాయి. ప్రభుత్వం కమ్యూనిస్టులపై యుద్ధంమాని, రక్షణకొరకై ఐక్యంకావలసినదని ప్రభుత్వంపై వత్తిడి తెచ్చారు. ప్రతిచోట ప్రజలు దేశశత్రువుకు వ్యతిరేకంగా సైన్యాలన్నిటినీ ఐక్యపర్చవలసినదని డిమాండు చేయ ప్రారంభించారు. ఐక్యతావాంఛ అన్నివర్గాలలోను వ్యాపించింది.

తమ దేశరక్షణకై మేల్కొన్న పెకింగు విద్యార్థులు బ్రహ్మాండమైన ప్రదర్శనం జరిపారు. వేలాది విద్యార్థినులు గూడా పాల్గొన్నారు. ఒక విద్యార్థిని ప్రదర్శించిన చొరవ, వీరత్వమే గండాన్ని తప్పించింది. పట్టణం వెలుపల సమావేశమైన విద్యార్థులు లోపలికి రాకముందే పట్టణంగేట్లు మూసి వేయబడ్డాయి. ఫిలిన్ అను పేరుగల ఒక విద్యార్థిని చాల దుర్బలురాలు. అయినా ఆమెకు ఆ పెద్ద ఇనుపగేట్ల ఊచలకు ఎగబ్రాకే సాహసం ఉద్భవించింది. వెంటనే ఆమె కావలివాండ్రనుండి తాళపుచెవులను దొంగిలించి గేట్లను తెరిచి, బయట ఎదురుచూస్తున్న వేలాదిమంది విద్యార్థులకు ప్రవేశమిచ్చింది.

సూర్యోదయంనుండి కనుచీకటివరకు పీపింగు సుందర వీథుల్లో మార్చ్ చేశారు. పోలీసులు మాటిమాటికీ వరుసలను

చెదరగొట్టుచున్నా సమూహాలకు సమూహాలు యింకా చేరు తూనే వున్నారు. అసమాన ధైర్య సాహసంతో ఎదుర్కొన్నారు. ఫైర్ డిపార్టుమెంటువారు (ప్రభుత్వ తుపాకీదళం) ప్రదర్శకులపై మంచునీరు కురిపించినా వారు చలించక నే కదలిపోయారు. (పీపింగు చలికాలపు కొరకరాని చలిలో) పోలీసు శ్రేణులమధ్యగానే, తోలుబెల్టులతోను, తుపాకి మడమలతోను బాదుతున్నా వారు నడచివెళ్లారు. లక్షల కరపత్రాలను పంచిపెట్టారు......"పోలీసుసోదరులకు, ఆయుధాలను ధరించిన ప్రియమైన స్వదేశీయులకు, మన చైనీయులందరూ ఒకటే. మనదేశాన్ని రక్షించుటలో మాకు సహాయపడండి. మాతో కాదు పోరాటం......జపానువాళ్లతో పోరండి......" వారి సాహసం, వారి ఆత్మ నిగ్రహం, దేశభక్తి ప్రజలనందరినీ ఉత్తేజపరిచాయి. అంతేగాదు, జపాను అనుకూల ప్రభుత్వ వార్షికోత్సవం వాయిదాపడింది. తాత్కాలికంగా జపాను సామ్రాజ్యవాదులు అదుపులో వుంచబడ్డారు.

చైనాలోనేగాదు, ప్రపంచమంతటా ఈ దశ యువజనుల కందరికీ విషమపోరాటసమయం, గొప్పభంగపాటు దశకూడ. అబిసీనియా స్వాహా అయింది. రిపబ్లికన్ స్పెయిన్ గుక్క తిరగలా. జెకోస్లోవేకియా "శాంతికాముకుల" మూకీ భావంతో ఫాసిజం పాదాక్రాంతమైంది. పశ్చిమాసమాదిరిగానే తూర్పున గూడ 3 వ దశాబ్దం (20 వ శతాబ్దంలో) మానవచరిత్రలోనే "గడ్డు రోజులు."

1936లో చైనాలోని పరిస్థితులు ఒకదశ నందుకున్నాయి. ఐక్యతకోఅనుజరిగిన తీవ్రాందోళన ప్రక్కకు నెట్టివేయబడలేదు. సియాన్‌లో మకాం చేసియున్న కమ్యూనిస్టు వ్యతిరేక సైన్యాల అధిపతిఅయిన యుద్ధప్రభువు ఛాంగ్ షేయ్ లియాంగుకు గూడ శాంతినినాదం సోకింది. ఛాంగ్ షేయ్ జపాను పంజాక్రింద ఉన్న మంచూరియా నుండి వచ్చినవాడు. జపానుయెడల అతని ద్వేషమంతా జపానుకు సంభవించే ప్రతి నూతన విజయానికి మరింత ఉధృతమవుతోంది. జపానుకు వ్యతిరేకంగా యుద్ధరంగం తెరచుటలో ఆలస్యంచేస్తున్న కొమింటాంగు యెడల అసహనం పెరిగిపోతోంది. జపానును తుత్తునియలు చేయడమే అతని వాంఛ కాని జంగు-కై-షేక్ ఆర్డర్లుమాత్రం విద్వేష కమ్యూనిష్టులను తుదముట్టించమని. 1936 లో జరిగిన సంఘటన అపమాడ్వర్లు తన రాజ్యాన్ని వదులుకొన్నదాని కంటె ప్రపంచానికంతా మహాశ్చర్య కరమైన విషయం.

తన స్వంత సైన్యాలచేతనే జంగు-కై-షేక్ ఎత్తుకొని పోబడడం, మరల అతని శత్రువులైన కమ్యూనిష్టుల ప్రాబల్యం కారణంగానే అతడు విడుదలకావడం. అది "సియాన్ సంఘటనల పేరుతో ప్రసిద్ధికెక్కినది. కమాండరు ఛాంగు షేయ్‌లియాంగు సియాన్‌లో జంగు-కై-షేకు కమ్యూనిస్టు వ్యతిరేక సైన్యాలను నాయకత్వం వహించినప్పుడు కమ్యూనిస్టులను సర్వనాశనంచేసే అంతిమదండయాత్రకై "మార్చ్" చేయవలసినదిగా ఆర్డర్లు జారీ చేయబడ్డాయి. ఛాంగుషేయ్ మంచూరియన్ నివాసి. అందువల్ల సహజంగానే అతనికి జపాను విద్వేషం ఎక్కువ. జపానుతో పోరాడవలెనని అతని

అభిలాష. అంతేగాకుండా అతని సైన్యాలుగూడ కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా పోరాడ నిరాకరించాయి. జంగు - సై - షేను సియాన్‌లో కమ్యూనిస్టులపై దండయాత్ర యెందుకు పురోగమించడంలేదో స్వయంగాపరీక్షించవలెనని సియాన్‌కువచ్చాడు. సియాన్‌లోని సైనికులు వారు జపానుతోనేగాని, కమ్యూనిస్టులతో యుద్ధం చేయమని చెప్పారు. అతనిని బందీగా పట్టుకున్నారు. అంతర్యుద్ధాన్ని మాని జపానుకు వ్యతిరేకంగా దేశాన్ని తయారుచేయవలసినదిగా అతనిపై వత్తిడి తెచ్చారు. దురుసు స్వభావంగల ఆఫీసర్లు జంగును బహిరంగ విచారణ జరపాలని నిశ్చయించారు. అది బహుశా అతనిమరణమే శాసిస్తుంది. ఆ సంఘటనా ప్రదేశానికి పరుగెత్తిన కమ్యూనిస్టు నాయకులు జపానుకు వ్యతిరేకంగా చైనాను ఐక్యపర్చగలిగినవాడు ఒక్క జంగుయే కాబట్టి బహిరంగవిచారణ శుద్ధ అవివేకమని నచ్చచెప్పారు. అతని మరణం అభివృద్ధినిరోధక యుద్ధ ప్రభువులను పట్టపగ్గాలులేకుండా జేసి జపానుతో వియ్యమందుకొనేస్థితికిగాని వచ్చేది. ఇండియా పత్రికల్లో జంగును కమ్యూనిస్టులే ఎత్తునిపోయారని తరుచుగా ప్రకటింప బడుతుండేది. ఇది శుద్ధఅబద్ధం. చైనాను ఐక్యపర్చగల శక్తివంతుడు జంగు ఒక్కడేనని కమ్యూనిస్టులు గుర్తించారు. నిండు అర్థంతో దేశభక్తులుగా గత పదిసంవత్సరాల ఘోరమైన అంతర్యుద్ధాన్ని మరచి జపానుతోపోరాడే చైనా సైన్యంలో వకభాగంగావుండి చైనాకు సేవచేయ సిద్ధపడ్డారు. బేషరతుగా జంగు వదలివేయ బడ్డాడు. తరువాత కొమింటాంగు - కమ్యూనిస్టు ఒడంబడిక జరిగింది.

ఈవొడంబడిక ప్రకారము రెడార్మీ కేంద్ర ప్రభుత్వ ఆధిపత్యం

క్రింద ఫైత్ రూట్ ఆర్మీగా మారింది. కమ్యూనిస్టులు తమ కమ్యూనిస్టు ప్రచారాన్ని పూర్తిగా మానుకోవాలి. కొమింటాంగు చైనాఅంతటా ప్రజాస్వామిక హక్కులను నెలకొల్పాలి.

— —

# ప్రతిఘటనా యుద్ధం



"లేవండి, బానిసలు కానిష్టపడనివారంతా లేవండి,
మన రక్తం, మన మాంసమె నూతన గ్రేట్ వాల్......
లెండి! లేవండి! మేల్కొనండి!
లక్షలొకటిగా,
శత్రుఘిరంగిని ఢీకొంటూ!
ముందుకే! మున్ముందునకే! మరి ముందునకే! పదండి!"

—టీన్ హాన్,

*From* 'The March of The Manchurian Volunteers' 1934

చైనాపై జపానుయుద్ధం ప్రపంచ ఆగ్రహానికే గురి అయింది. జపాను పతనానికి కారణమైన ఆధునిక చైనా యొక్క మహత్తర ప్రతిఘటనను అర్థంచేసుకోవాలంటే మనం

ముందు ఈ ఫాసిస్టు యుద్ధస్వభావాన్ని గుర్తించాలి. యుద్ధం యుద్ధమే. యుద్ధభీకరాలు, ప్రత్యేకంగా ఫాసిస్టు యుద్ధఘోరాలు సామాన్యంగాదని కొందరు వాదిస్తారు. ఫాసిజం అంటే యేమిటో ఎంతటి దుష్ట, విధ్వంసక శక్తియో మనం ముందు అవగాహన చేసికోవాలి. ఫాసిజంక్రింద అందరికంటె ఎక్కువగా బాధపడేది రెండేవర్గాలు- కార్మికులు, స్త్రీలు. ఫాసిస్టు పరిపాలనలో స్త్రీలగతి మరీ అధ్వాన్నం.

అత్యాశ్చర్యకరమైన విషయం. జపాను పురోగమిస్తున్న కొలదీ భయపడిన స్త్రీలు, బిడ్డలు, పురుషులు 40 మిలియన్ల మంది, దేశం యావత్తూ ఒక్కుమ్మడిగా లేచింది. ఇది ప్రపంచాన్నంతనీ ఆశ్చర్యచకితని చేసింది. స్త్రీలు మిలియన్లుగా చేల్కొన్నారు. తమ పాత్రను హృదయపూర్వకంగా నిర్వహించారు. ఎందువలన? సామాన్య యుద్ధమనేగాదు, అంతకు మించిన విషయ మన్నమాట. ప్రజలు ఎందుకు పోరాడారో చైనీయులు రాజకీయాభిప్రాయాల్లో మితవాదిగా పరిగణించే లిన్‌యుటాంగ్ వాక్యాలనే పేర్కొందాం.

మిలియన్లకొలది ప్రజలు తీరప్రదేశాలనుండి చైనా మధ్యభాగానికి తమ గృహాలు, పట్టణాలు వదలి, భారంతో పర్వతాల నెక్కుతూ, దిగుతూ, నదులను దాటుతూ అసాధారణ శత్రువు జరిపే అగోచరదాడికి వారుపెట్టే చిత్రహింసలకు భయపడి పారిపోయి వస్తున్నారు. శత్రుహింస ఘోరాతిఘోరంగా వుంది. టాంకులతో, తుపాకులతో, గ్రెనేడ్‌లతో జరిపే యుద్ధభయభీతాహం గాదిని. మిన్ను విరిగి పడిపోతుందా

అన్నంత భీతిపుట్టించే గాలిలో వదలే బాంబుల యుద్ధంగాదది. ......నాగరికత పుట్టినప్పటినుండి మానవుల్ని మానవులు హత్యచేశారు. "ఛాపే" చుట్టూగల గ్రామీణులు నెలలపర్యం తం తుపాకిగుండ్లవర్షం కురిపిస్తున్నా తమ గృహాలను త్యజించ లేదు. భగవంతుడు మానవుని సృష్టించినప్పటినుండి నేటి వరకు మానవనేత్రాలు, ముక్కుపచ్చలారని పసిబిడ్డను పైకి గాలిలోకి ఎగరవేసి అతి నేర్పుగా బాయొనెట్ కొనతో గ్రుచ్చి పట్టకొని, అదొక ఆటగా ఆచరిస్తూ వికటాట్టహాసంచేసే సైనికుల్ని చూడలేదు. నరహత్యాశిక్షణా పరిజ్ఞానానికి, బాయొ నెట్ ప్రాక్టీసుకై గురిచిహ్నాలుగా కళ్లకు గంతగట్టబడిన ఖైదీ లను కందకాల ఒడ్డున నిలబెట్టడం మానవనేత్రాలు గాంచ లేదు. సూచేనుండి నాంకింగ్‌కు చైనా సైన్యాల్ని వెన్నంటి తరుముతూ యిద్దరుసోల్జర్లు మొదటి వందమందిని ఎవరు మొద టగా చంపుతారోనని పందెంవేసికొన్నారు. వారిరువురిఆట తోటిసైనికుల కందరికీ ప్రాకింది. "శాముర్రై" పవిత్రధర్మాలు ఆ జమీందారీ సమాజపు ప్రజలకు తక్క మరే యితరదేశాల ప్రజలకు వివరించలేవు. ఆదిమ అరణ్యాలలో ఒక చెట్టుమీద నుండి మరోచెట్టుమీదికి గంతువేసే గొరిల్లాల దగ్గర వారసు లైన ఆనాటి మానవులకుగూడ ఇలాంటి దారుణచర్యలు అసం భవం. గొరిల్లాలకే సంభవంగావు. గొరిల్లాలు తమ ఆడ గొరి ల్లాలకొరకు మాత్రమే వేటైనా చంపుతాయి. మానవబుద్ధి వికాసచరిత్రలోనే నాగరికతా ప్రథమదశల్లోనే మానవులు సంతోషంకొరకు మానవుల్ని చంపటంలేదు.

"కాదు, యీఘోరాలు ఒక గుంపుజనులు మరొక

గుంపువారిని చంపిన ఘోరాలలాంటివి. గొరిల్లాలు గొరిల్లా ఖైదీలను చుట్టుముట్టి, పూరిచావిడిలో పెట్టి దానిపై కిరోసిన్ పోసి నిప్పంటించి అది తగలడుతూంటే చూచి వికటాట్టహాసంతో పరమానందం చెందవు. గొరిల్లాలు పట్టపగలు బహిరంగంగా సంయోగిస్తాయి. కాని అవి సంయోగం జరుపుతున్నటువంటి మగ గొరిల్లాలవంక మరికొన్ని మగ గొరిల్లాలు తమ వంతుకొరకు ఉల్లాసపడుతూ, సంబరపడుతూ చూస్తూ నిలబడవు. ఆడగొరిల్లాలు వ్యతిరేకించిన యెడల వాటి మర్మావయవాల్లో బాయొనెట్లు గొరిల్లాలు గ్రుచ్చలేవు. ఆడగొరిల్లాలను చెరిచేటప్పుడు, బూతులు కూసేటప్పుడు వాటి భర్తల్ని ఎదురుగా నిలబడమని బలవంతపెట్టేటంత సున్నితమైనదిగాదు వాటి నాగరికత......"

డాక్టరుబాసు, జపానువాళ్లు ఒక సంవత్సరంపాటు ఉన్న తరువాత తిరిగి వైట్ రూట్ ఆర్మీచే పునరాక్రమింపబడిన ఒక జిల్లాలో తాను స్వయంగా చూచిన దృశ్యాలను వర్ణించిరి. జపానువాళ్లచే చంపబడకుండా, నిర్వాసులుగా చేయబడిన స్త్రీలు హాస్పిటలుకు వచ్చారు. వారి శరీరాలు "మానవుని ఊహ కందనటువంటి రీతిగా" నాశనం చేయబడ్డాయి. తల్లులు, అక్కాచెల్లెళ్లు చెరచబడేటప్పుడు అక్కడే బంధించబడి కళ్లార వ్యధపడిన యువకుల్ని డాక్టరుబాసు స్వయంగా ఎరుగును. ఈ కృత్యాలన్నీ యుద్ధోన్మాదంతోనే జరిగినవికావు, స్త్రీలకు మానవహోదాను, నూతనంగా వారు సాధించుకున్న స్వాతంత్ర్య చిహ్నాలులేకుండా రూపుమాపడమే వారి యీ ఘోర దుర్మార్గ విధానం.

ఈ పశుత్వానికి స్త్రీలు ఎలా జబాబిచ్చారు ? కియాంగ్సీలో (ప్రథమంగా సోవియట్లు నెలకొన్న ప్రదేశం) 65,00,000 మంది స్త్రీలు దేశరక్షణకై సంఘటితమయ్యారు. ఈ సంఖ్య షుమారు మన ఇండియాలోని ఒక పెద్ద సంస్థానం జనాభాకు సరిపోతుంది. జపాను శ్రేణుల వెనుక గెరిల్లాప్రాంతాల్లో మాత్రమే 20,000 మంది స్త్రీలు A T S లో పనిచేశారు, సంపూర్తి నిర్మాణం కలిగిన యూనాన్ బర్మారైల్వేనిర్మాణానికి అర్థ మిలియన్ మందికార్మికులు అవసరమైనారు. అందులో 3,00,000 మంది స్త్రీలే. చరిత్రాత్మకమైన బర్మారోడ్డు, సోవియట్‌యూనియన్‌కు వెళ్లిన గ్రేట్‌నార్తు వెస్టు హైవే ( Great North-west Highway )లను ఎక్కువభాగం స్త్రీలే నిర్మించారు. బర్మారోడ్డు 9 నెలలో నిర్మించబడింది పొడవు 700 మైళ్ళు. పైగా ప్రపంచంలోకెల్లా కఠినతరమైన ప్రదేశము మీదుగా నిర్మించ వలసి వచ్చింది. ఈ ప్రమాదకరమైన సాహసకృత్యంకొరకు అనేక వేలమంది స్త్రీ పురుషులు బలియైనారు...... సంఖ్య సరిగా తెలియదు. కాని అపాయకరమైన పనినిగూడచాలీచాలని జీతాలతో నెరవేర్చే సాధారణ కార్మికులుగా మాత్రమే వారు యీ మహత్తర బాధ్యతను నెరవేర్చలేదు. కాని దేశభక్త స్త్రీలుగా, పురుషులుగా మాత్రమే తమసైన్యాలకు సరఫరాలు అందజేయుటకై ప్రపంచానికి మార్గంకావాలనే దృఢనిశ్చయంతోనే వారు యీపని సాధించగలిగారు.

ఈ బాటలే చైనా స్మృతిచిహ్నాలు; చైనా సాహసం, ఓర్మి, బుద్ధికుశలత, ధృఢత్వాలకు చిహ్నాలు; స్త్రీలు నిర్వహించినపాత్ర స్త్రీలకు గర్వకారణ విషయం. మానవజాతి చరిత్ర

లోనే అత్యంత మహత్తరమైన విషయంగా చరిత్రలో లిఖింప బడుతుంది.

అన్ని స్త్రీ సంస్థల ప్రసిద్ధ కూలింగు మహాసభ 1938లో జరిగింది. ఆ మహాసభకు అధ్యక్షురాలు మదాం జంగుకై షెక్. నేషనల్ వుమెన్స్‌రిలీఫ్ అసోషన్, చైల్డ్ రెఫ్యూజీ రిలీఫ్ అసోసియేషన్, వై. డబ్ల్యు. సి. ఎ., నేషనల్ శాల్వేషన్ సొసైటీస్ (National Salvation Societies) ఇంకా తదితర స్త్రీల సమస్థలన్నీ ఒకే కేంద్రసంస్థ "వుమెన్స అడ్వయిజరీ కమిటీ" గా ఏర్పరిచారు. ఈ కమిటీ అనేక కార్యక్రమాలను నిర్వహించింది. యుద్ధ అనాధుల బాధ్యతను వహించింది. వారిసంఖ్య మిలియన్లలోకి వెళ్లింది కాబట్టి యీ బాధ్యత మహత్తరమైనది. గ్రామీణ స్త్రీలకు విద్యనేర్పుట సైన్యాలకు క్లబ్బుల నేర్పాటుచేయుట, గాయపడినవారికి కంఫర్ట్సు గూళ్ళులను నెలకొల్పుట, యుద్ధసామగ్రిని ఉత్పత్తిని ప్రోత్సహించుట, స్త్రీలకు ఆర్గనైజరుగాను, నాయకులుగాను తర్ఫీదు చేయుట, గృహ చేతిపరిశ్రమలను ఉద్ధరించుట, పత్రికలను నడుపుట వగైరా తదితర కార్యక్రమాలను గూడ నిర్వహించింది. వీటిలో అనేక డిపార్టుమెంట్లు గొప్పపనినే నెరవేర్చుతున్నాయి. టింగుఅంగ్సు సర్వీస డెమోక్రటిక్ గ్రూపులూ, యూనాన విమెన్స బాటిల్ ఫీల్డు సర్వీసు యూనిట్–అవి రెండు గ్రూపులూ యుద్ధరంగానికి 2000 మైళ్ళు నడిచి వెళ్ళి అద్వితీయమని పేరుగాంచినవి. కియాంగ్సీ వుమెన్స బెటాలియన్ ఫిప్తవార్ జోన్‌కు 1500 మైళ్లునడచి వెళ్ళి అక్కడ సైనికులతో పనిచేశారు.

# చైనా ఇండస్ట్రియల్ కో-ఆపరేటివులలో స్త్రీలు

( సి. ఐ. సి. )



సి. ఐ. సి సంస్థలు ఇండియాలో ఎక్కువ ఉత్సుకతను రేకెత్తించాయి. నిమ్‌వేల్స్ వ్రాసిన "చైనా బిల్డ్స్ ఫర్ డెమోక్రసీ" అనే పుస్తకానికి వ్రాసిన తన దీర్ఘ ఉపోద్ఘాతంలో పారిశ్రామిక సహకార సంస్థల సమస్య ఇండియాలో ఎక్కువ ప్రాధాన్యం వహించినదనీ, ఎందువల్లనంటే భారీ పరిశ్రమలకు, గృహపరిశ్రమలకు మధ్యగల అవినాభావ సంబంధం విషయంలో చైనా వలెనే ఇండియాలోగూడ అదే పరిస్థితులున్నాయనీ వివరించారు.

ఈ కార్యక్రమ రంగంలో స్త్రీలు నిర్వహించిన పాత్ర గూడ ఉత్సాహకరమైనట్టిదే. బాగా అభివృద్ధిచెందిన స్త్రీల కో-ఆపరేటివ్, ఆదర్శంగా పరిగణింపబడే స్త్రీల సహకార సంస్థ పశ్చిమోత్తరాన యున్నది. ఈ సంస్థ ఒక్కటే 6000 మంది స్త్రీలకు, 20,000 మంది పిల్లలకు బాధ్యత వహించి 1000 ప్రాథమిక పాఠశాలలు నడుపుతుంది. 600,000 మంది స్త్రీకాందిశీకుల్ని, గాయపడిన సైనికుల్ని సంఘటితపరచి

వారు పారిశ్రామిక ఉత్పత్తిలో సహాయపడేలాగా చేశారు. వేలాది సభ్యత్వం గల మూడు స్త్రీల క్లబ్బులను నడిపారు. ప్రతి క్లబ్‌కు స్వంత వార్తాపత్రికలు, చర్చలు, సభలు, రాత్రి పాఠశాలలు, వైద్యాలయాలు, హెల్తు సూపర్వైజర్లుంటారు.

ఈ ఆదర్శ సహకారసంస్థ నిర్వాహకురాలు జెన్‌చూ-మిన్. అమె ఒకసారి తన రిపోర్టులో యిలా చెప్పింది. "చైనాలో వెనుకబడిన యీ ఫాదైన్యభూభాగంలో స్త్రీల హోదాను వృద్ధిచేయుటకై మేం అతిప్రాముఖ్యమైన ధర్మాన్ని నిర్వర్తిస్తున్నాం. యుద్ధం స్త్రీలకు మంచి అవకాశాన్నిస్తుంది. మేం మేధావులం. అమాయక రైతు స్త్రీజన సామాన్యంతో ప్రత్యక్ష సంబంధం పెట్టుకొని మాఖాళీ సిద్ధాంతాలను సంపూర్ణం గావించాం. అదేవిధంగా తిరుగా రైతుస్త్రీలు మానుండి స్వాతంత్ర్య శక్తిని గ్రహిస్తున్నారు. మేము ప్రజలకు స్త్రీలు, బంధించబడిన పాదాలుగలవారు కూడ, బహిః శత్రుదాడి, దేశంలోని నిరంకుశత్వం, యీ ద్వంద పీడను ఎదిరించి నిలబడ గలరని చూపుతున్నాం........."

జెన్‌చూ-మిన్ ఇంగ్లాండులో విద్యనభ్యసించినది. తరువాత ఆమె చైనాకు తిరిగివచ్చి తననుగూర్చి యిలా అన్నది. "నేను నేర్చినదంతా వినయవిధేయతాపూర్వకంగా నాప్రజలకు అర్పిస్తాను." తన స్త్రీల డిపార్టుమెంటు భవితవ్యం విషయంలో ఆమెకుచాల ప్లానులువున్నాయి. పైనవివరించిన కార్యక్రమాలలో, సహకార సంస్థ నడిపే "గార్డెన్‌సిటీ"గూడ ఒకటి. అది బీద స్త్రీలు, విధవలు, అనాథలు నడుపుకొనే ఆదర్శసంస్థ. అక్కడ ప్రాథమిక పాఠశాలల్లో 100 మంది బాల బాలికలు

చదువు నేర్చుకొంటున్నారు. 560 స్త్రీలు రోజుకు 1000 కాటీలు (కాటీ అంటే దాదాపు ఒక పౌను) ఉన్ని వడుకుతారు. తక్కిన వారు రోజుకు 75 యూనిఫారాలు కుట్టుతారు. 20 మంది స్త్రీలు ప్రతి టరంకు టెక్స్టైల్ ట్రైనింగు స్కూలులో తరిఫీదు అవుతారు.

ఈ సహకార సంస్థను నిర్వహించుటలో సహాయపడే నాయకురాండ్రు మొత్తం 51 మంది వున్నారు. అందులో ముగ్గురు విదేశాల్లో యూనివర్శిటీ విద్య నభ్యసించినవారు. 9 మంది చైనా యూనివర్శిటీల్లో విద్య నభ్యసించినవారు. వాంగ్ జూ-చీ అధికారంలో రెండవ పదవి నలంకరించింది. ఆమె షాంఘైనివాసి. ఆమె న్యూలైఫ్ మూవ్మెంటు (New Life Movement) కేంద్రకార్యాలయములో మదాం జంగు కై షెక్ నాయకత్వాన పనిచేస్తోంది. ఆమె స్త్రీనిర్వాహకుల నాయకత్వం తర్ఫీదును గూర్చి వక గ్రంథం (1,00,000 పదాలు) వ్రాసింది. ఈ 51 మంది స్త్రీలు, అత్యంత ధీశాలురు. సమర్థులు. మార్షల్ చాంగ్ షేయ్ లియాంగు మేనగోడలు పావోయీ "సియాన్ సంఘటన"లో పాల్గొన్నది. ఆమె యిలా అంటుంది. "ఇది మన పరీక్షాసమయం. మనం దేశానికి ప్రాముఖ్యముగల వారముగా, గొప్ప సేవకులంగా చాటినయెడల, కష్టాలన్నిటినీ సహించి, పురుషుల సహాయం లేకుండా ఆర్థికంగా మనపాదాలపై మనం నిలబడగలమని ఋజువుచేసినట్లయితే యుద్ధం తరువాత స్త్రీలపరిస్థితి 1927 నాటి పరిస్థితికంటెను భిన్నంగా వుంటుంది............"(అంటే విప్లవ ప్రతీఘాత ఉద్యమానికి ముందు.)

పారిశ్రామిక సహకారసంస్థలు ప్రమాద ప్రదేశంలో వుండడంచేత బాంబులకుగూడ గురి అయినాయి. గెరిల్లా ప్రాంతాల్లోను, యుద్ధశ్రేణులకు దగ్గరగా వున్న సహకార సంస్థలు స్వేచ్ఛాపూర్వకంగా అర్ధ మిలిటరీ క్రమశిక్షణకు లోబడి నెలకొల్పబడ్డాయి. విద్రోహం తలపెడితే సహకార సంస్థలనుండి వెళ్లగొట్టి శిక్షిస్తారు. ఇంతవరకు ఆవిధంగా ఒక్క స్త్రీగూడ శిక్షించబడలేదు. మదాంసగ్ వక టెక్స్టైల్ యూనిట్ యొక్క అధ్యక్షురాలు. ప్రశాంతత, సాహసాలను గూర్చి ఈ క్రింది కథను వివరించింది. జపానువాళ్లు సహకార సంస్థను మూడువైపులా మైలులోపు దూరంలో చుట్టు ముట్టారు. ఆమె తక్కిన సభ్యుల నందరినీ పంపివేసి తాను కదలించ వీలులేని సామగ్రి యావత్తూ పాతిపెట్టి, కొన్ని తేలిక సామానులను తన మూపున గొనిపోయింది.

అలాంటి ధీరత్వం, రాజకీయ చైతన్యమే వక తుపాకిగాని, లేక బాంబుతో సమానమైన వక శక్తివంతమైన ఆయుధంగా పరిగణించబడే ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంయొక్క సిసలైన అర్ధాన్ని యీ స్త్రీలు గుర్తించబట్టే అది సాధ్యమైంది. డాక్టరుబాసు పశ్చిమహూపెలోని గెరిల్లా బ్రిగేడ్ రాజకీయశాఖ నాయకురాలు యాంగ్‌నుగూర్చి వివరించేగాథ యీ పాయింటును మరింత విశదపరుస్తుంది. యుద్ధారంభంలో ఆమె పెకింగ్ యూనివర్సిటీలో విద్యార్థిని. యాంగ్‌తోసహా 250 మంది విద్యార్థులు విశాలభావాలు గలవాడని ప్రసిద్ధిచెందిన వక ప్రొఫెసరు నాయకత్వాన పీపింగును వదలి మైత్‌రూట్,

ఆర్మీతో సంబంధం పెట్టుకొన్నారు. వారికి గెరిల్లా పోరాటం తర్ఫీదు యివ్వబడింది. వారిసంఖ్య దేశభక్తులు వచ్చి చేరుతూండబట్టి క్రమంగా వృద్ధిచెందింది. యాంగును ఇంకొక ట్రయినింగు కొరకు యెనాన్ పంపారు. అక్కడ గెరిల్లాలలో మలేరియా వ్యాపించుటచేత యాంగ్ వెంటనే చికిత్సకొరకు హాస్పటలుకు పోవలసివచ్చింది. హాస్పటలు మంచంపై పరుండి జ్వరతీవ్రతతో వణకుచున్నపుడే ఇండియన్ నేషనల్ కాంగ్రెసు మెడికల్ మిషన్ ప్రతినిధులు యెనాన్‌కు వచ్చారనీ, హాస్పటలుకు వస్తున్నారనీ విన్నది వెంటనే తన వ్యాధిని, తన బలహీనతను విస్మరించి పక్కమీదనుండి లేచి, జ్వరంతో వణకుతూ హాస్పటల్ అంతా తిరిగి ప్రతిఒక్కరికీ వలసరాజ్యమైన ఇండియా నుండి వచ్చిన యీ స్నేహోదరాలు ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంలో పోరాడుతున్న చైనాకు ఎంతగా ఉపకరించ గలవో వివరించింది. అన్ని దేశాల స్వాతంత్ర్యం ప్రతి దేశంయొక్క భాగ్యంతో ఎలా ముడిపెటబడవుందో నచ్చజెప్పి ఫాసిస్టు అభిప్రాయాలను తూలనాడింది. హాస్పటలులోని చాలమందిలో యుద్ధం యెడల సామాన్యమైన దృక్పథం వుండేది. యీ యుద్ధం గత యుద్ధాలకంటె ఎలా భిన్నమైనదో చక్కగా యాంగ్ వివరించిన తరువాత వారు అర్థంచేసికొన్నారు. అచంచల దీక్షతో పోరాడే కృతనిశ్చయాన్ని కలుగజేసింది. ఇలాంటి ఘటనలే వేలాది దేశభక్తులు యెనాన్‌కు వచ్చి తమ దేశంకొరకు ప్రాణాలను అర్పించడానికి సిద్ధపడ్డారు.

యాంగ్ సైనికుని జీవిత కష్టాలన్నిటినీ అనుభవించింది. ఆమె సహన గెరిల్లాదళాల మన్ననలను, ఆదరాభిమానాలను పొందుటచేత వారు ఆమెను యాంగుక్జీ అని పిలిచేవారు (అక్క). ఆమె పురుషునివలె పోరాడింది. అయినా యింటిలో ఎంతో మృదులంగా మాట్లాడేది. డాక్టరుబాసు ఆమెను యెనాన్‌లో కలిసికొన్నాడు. అక్కడే ఆమె ఆయనతో కలిసి పనిచేసింది.

మరో స్త్రీగాధ. ఆయన ఆమె పేపింగునుండి ఎలా, ఎందుకు వచ్చేసిందో యిలా వివరించాడు. ఆమె ఒక డాక్టరు. అమెను తల్లిదండ్రులు ఒక శ్రీమంతునికిచ్చి వివాహం చేశారు. అతనికి ఏకోశానా దేశభక్తి అనేది లేకపోవడంచేత అతని యెడ ఈమెకు అయిష్టత ఏర్పడింది. అందువల్ల ఆమె అతనిని వదలి హాస్పిటలులో పనిచేయ ప్రారంభించింది. భర్త ఆమెను నానాహింసలు పెట్టేవాడు. అందువల్ల అవకాశం, అదను చూచుకొని దేశానికి తన ఉడుత భక్తి సాయం చేయడానికి యెనాన్ వెళ్లింది. ఆమెకుటుంబము ఆమెను బెదరించింది. కాని ఆమె యిలాజవాబిచ్చింది, “నా నూతన జీవితమార్గాన్ని కనుగొన్నాను.”

సహకార సంస్థలు స్త్రీలలో ఆత్మవిశ్వాసం, ఆత్మ గౌరవాలను ఉత్తేజపర్చుటలో ఉపకరించాయి. భిక్షాటన, పడుపు వృత్తి బారినుండి వారిని రక్షించుటయే గాక వారిలో నూతన విశ్వాసాన్ని ప్రజాస్వామ్యాభిప్రాయాన్ని కలుగజేసినాయి. చైనా చరిత్రలో ప్రథమపర్యాయంగా (సోవియట్ చైనా మినహా) సహకార సంస్థలలోని స్త్రీలు వోటుహక్కు, స్వ

యంగా ఆలోచించుకొని ప్రవర్తించే హక్కు ననుభవిస్తున్నారు. వీరికి పురుషులతో సమానమైన హక్కులున్నాయి. స్త్రీలు గాను, యుద్ధకాలంలోని ప్రధాన పారిశ్రామిక యూనిట్ సభ్యులుగాను తమవిలువను గుర్తించ మొదలిడారు. జెన్ చూమిర్ ఇలా అంటుంది, "పశ్చిమోత్తర భూభాగంలో వారు యిప్పటికే చేస్తున్నదానిని బట్టి చైనాజీవితంలో స్త్రీల స్థానం స్వాతంత్ర్య మొక్కటేగాదు, అంతకుమిన్నగా, సమాజ నాయకత్వమే........"

స్త్రీలు దేశభక్తులుగా తమ కర్తవ్యాన్ని ఎలా అర్థం చేసికొన్నారో యుద్ధరంగంలోని సైనికులకు సౌత్ - వెస్టు (Soth-west) లోని స్త్రీల ట్రయినింగు క్లాసువారు వ్రాసిన లేఖయే ఉదాహరణ.

"ధీరసైనికులారా !

వేసవి వాతావరణంలో మీరు జపాను దయ్యాలతో పులులులాగా పోరాడుతారు. వారు రాత్రింబవళ్లు కురిపించే తుపాకుల, విమానాల వర్షానికి మీరు అలసిపోరు.

మిమ్ములను మేం మెచ్చుకునేటంతటి ధీరులుగా మీరు ప్రవర్తిస్తున్నారు. దేశస్వాతంత్ర్య విముక్తులకై అనేక ప్రమాదాలను, బాధలను సహించుతారు మీరు.

మేం మిమ్ములను పరమానందంలో ముంచెత్తగల వస్తువులను కొని రంగానికి పంపాలని ఎదురు చూస్తూంటారు. కాని మేం కాందిశీకులం. మాదగ్గర దమ్మిడీ వుండదు. అందువల్ల వాటికిమారుగా మిమ్ములను సంతోషపరిచే జాబులను వ్రాస్తున్నాం. మీకు పోరాడే శక్తికలుగుగాక !"

వారు పనిచేయడమే గాదు. చరిత్రలోనే అద్వితీయ మైనటువంటి అసమాన ధైర్యసాహసాలతో వారు దురాక్రమణ దారునితో పోరాడుతారు. హైనాన్ ద్వీపస్త్రీలగాధ వుంది. పురుషులులేని సమయంచూచి జపానీయులచటికి సైన్యాన్ని పంపారు. కాని స్త్రీల దగ్గర వ్యవసాయ పనిముట్లు మాత్రమే వున్నాయి. అయినా వారు సైన్యాన్ని ఎదిరించి చాల మందిని దివంగతుల గావించారు. జపానువాళ్లను తిరిగి ఓడ ఎక్కిం చారు. చైనాలో ప్రతిజిల్లా, ప్రతిగ్రామం యిలాంటి సాహస గాధలతో నిండి వుంటుంది. అలాంటి సాహసగాధలు పొక్క కుండానేగూడ వున్నాయి.

ఈ యుద్ధంలో మిక్కిలి ప్రసిద్ధిగాంచిన స్త్రీలలో అనేక నాటకాలకు కథలకుకథావస్తువు మాతాచావో. ఆమె మంచూ రియా నివాసి. జపానుతో 1932 నుండి పోరాడుతోంది. ఈ పండిపోయిన 68 సంవత్సరాల ముసలివృద్ధు నేడు 30,000 గెరిల్లాలకు జనరల్‌చావో. ఆమె, ఆమెభర్త, నలుగురు కుమా రులు, ముగ్గురు కుమార్తెలు ఒక గెరిల్లా గూ్రపుగా యేర్పడి చాలమంది చేలాగా హుషారిచ్చారు. హాంకేలో ఒక ఉప న్యాసంలో ఆమె యిలా అన్నది. "రక్త సంబంధమైన సోదర సోదరీమణులారా! నేనొక పల్లెటూరి అమాయకురాలను. నాకు చదువురాదు. జపాను మనదేశాన్ని నాశనంచేయ చూస్తుందనీ, అందుకుగాను మనం జపానుతో పోరాడాలని మాత్రమే నాకు తెలుసు. సాధారణ ప్రజలంతా తమ దేశాన్ని ప్రేమించాలని నాకు తెలుసు. నా కర్తవ్యాన్ని నేను ఒక పల్లె టూరిస్త్రీగా మాత్రమే నెరవేర్చుకున్నా. నాభర్త చాలా

ముదుసలి. అయినా నాకుమారులు, కుమార్తె లందరు యుద్ధం చేస్తూనేయున్నారు. పశ్చిమోత్తర భాగంలో మరొక సామెత వుంది, "ఇంట్లో ఎలుక లున్నాయని ఇంటినే తగులబెట్టడం..."

నమ్మశక్యంగాని ఘోర నాంకింగు సంఘటన ప్రపంచానికంతకూ తెలియజేయబడింది. అయినా నాంకింగు ఇంటర్నేషనల్ రిలీఫ్ కమిటీ రిపోర్టులు జపాను దుండగాలకు గురియైన వారి సంఖ్య మనకు తెలియజేస్తాయి. ఒక్క నాంకింగులో మాత్రమే 42,000 మంది చంపబడ్డారు. అందులో అధిక భాగం స్త్రీలు, బిడ్డలు. కాందిశీకులు అంతర్జాతీయ "భద్రతా ప్రదేశం"లో మూగారు. కాని అక్కడగూడ వారికి తగిన శరణ్యం లభించలేదు. రోజురోజుకూ సైనికులు ఆ ప్రాంతంలో జొరబడి జపాను సైనికులకొరకు స్త్రీలను బలవంతంగా లాక్కుపోయేవారు. మిషనరీ స్కూళ్లలోని యువతుల్ని వ్యభిచార గృహాలకు తరలించుకొని పోయారు. అలాంటి వారిగతి ఇక అంతే లేదు.

ఒక పదుపు స్త్రీలముఠా యొక్క దేశభక్తిగాథ చాల అమోఘమైనట్టిది. ఆ "భద్రతా ప్రదేశం"లోనే వీరుగూడ శరణుజొచ్చారు. అక్కడి తదితర స్త్రీలను జపానువాళ్లు బలవంత పర్చే సమయంలో ఈ భోగం యువతులు తమ సోదరీమణులను రక్షించుటకై తమ శరీరాలను త్యాగం చేయ సిద్ధపడ్డారు. వారికి గల శత్రువిద్వేషం కించపరచవలసినది గాదు. వారి యీ చర్య వారి మరణాంతరమేనని తెలుసు. అయినప్పటికీ వీరు నీచులుగా పరిగణింపబడినప్పటికీ విద్వేష, పరమ దుర్మార్గ శత్రువుకు తమ శరీరాలనే బలియిచ్చారు.

చైనా ప్రజల సాహసిక గాథలకు, దుష్టశత్రువుయొక్క పశుత్వ గాథలకు అంతులేదు. ఈగాథలు బయటి ప్రపంచ సానుభూతిని కలుగజేస్తాయా? అమెరికా బ్రాడ్‌కాస్టులలో మదాంజంగుకై షేక్ యిలా అన్నది, "బహుశా రేడియోలో మీరు ఫిరంగి కాల్పులధ్వని వినియుండవచ్చు. (ఆధ్వని యింకా మీ హృదయాల్లో మారుమోగుతోందని నేను ఆశి స్తున్నాను.) ఆధ్వనుల మరుగున మరణావస్థ నందున్న వారి ఆక్రందనాలు, గాయపడిన అసంఖ్యాకుల మూల్గులు, భవ నాలు కూలిపోతున్న కలకలంగూడ వినవచ్చు. మీ దృక్కు లలో గొప్పసైన్యం పడే బాధలు, అనుభవించే పస్తులు, భయ భీతాహం చెందినటువంటి అమాయక నిర్వాసులు, తల్లుల బాష్పాంజలి, దహన మౌతున్న వారి గృహాలనుండి పొగమం టలు మీకు కానవస్తాయి......"

"ఇక మరెన్నటికీ చైనా స్త్రీలు కదులాడు ఇసుక రేణువులు కాబోరు. జాతీయ ప్రభుత్వంతో వారు పూర్తిగా సన్ని హితమైనారు. ధనం, నేర్పరితనం, శక్తిసామర్థ్యాలను వారు సాధించుకున్నారు."

——

# కొమింటాంగ్ పాలనలో స్త్రీలు



చైనాలోని పురాతన కాలపు స్త్రీల హోదా క్లుప్తంగా వివరించబడింది. జాతీయ విప్లవ కాలంలో స్త్రీలు అభివృద్ధి నంది యుగయుగాల సంకెళ్లను త్రెంచుకున్నారు. చైనా పీడిత స్త్రీలు జనసామాన్యపు అణచబడిన క్రియాత్మక చొరవను విముక్తి కలిగించారు. రైతు స్త్రీలు, ఎర్రసైన్యాల స్వాధీనంలో నున్న ప్రాంతాలను తిరిగి గవర్నమెంటు సైన్యాలు వశంచేసి కొన్నతరువాత వారు పెట్టే దారుణహింసలనుగూడ లెక్క జేయకుండా వారు ఎర్రసైన్యాలకే సహాయ మొనర్చేవారు. రైతులపై పన్నుల భారం. వారి జీవితమే కడుంగడు భారమై నట్టిది. వారిజీవితం దుఃఖసముద్రం. ఇదే పరిస్థితి పెట్టుబడి దారుల పెత్తనంక్రింద ఉన్న పెద్ద పట్టణాల్లోగూడ విరాజమాన మౌతుంది. పెద్దపట్టణాలను పారిశ్రామికంగా అభివృద్ధిచేయు డం కారణంగా స్త్రీలపై పురుషుని ఆధిపత్యం సడలినప్పటికీ ఆ సామాజికయంత్రం వారిని ఫ్యాక్టరీల్లో బానిసలుగా జేసింది. ఈ స్త్రీలపరిస్థితి మరీ ఘోరం. 1927 కు పూర్వం యూని యన్లలో వేలాదిమంది జేరారు. ఒక్క స్త్రీ కార్మికులసమ్మెలే వారు బ్రహ్మాండంగా నడిపారు. కాని 1927 తరువాత విప్లవ ప్రతీఘాతోద్యమం దేశమంతటా విజృంభించినపుడు వారు

యూనియన్లలో సంఘటితపడడం అనుమతించబడలేదు. వారి జీవితాలు సౌఖ్యప్రదం గానీయకుండా మరల బానిసల జీవితమే గతి అయింది. ఈ స్త్రీలలో కొందరు, ఫ్యాక్టరీ కార్మికులు. అన్నాలూయీ స్ట్రాంగ్‌కు తమ జీవితాల్ని యిలా వివరించిచెప్పారు. "పురాతన ఆచారాల మూలంగా స్త్రీలు యింట్లోనుండి బయటికి అడుగువేయనవకాశం వుండేదికాదు. ....................వారి పాదాలను గట్టిగా కట్టివేశేవారు. లేకపోతేవరుడు దొరకడని భయం. బలవంతపు పెళ్ళిళ్లు. అందుచేత దాంపత్యం సౌఖ్యప్రదంగా వుండేదిగాదు. ఫ్యాక్టరీల్లో పనిచేస్తున్నప్పుడు ఫోర్మన్ వారిని పీడించేవాడు. అంతేగాక 12 గంటల శ్రమతరువాత గృహ నిర్వహణా బాధ్యత వారిపైగలదు............ఇప్పుడు, వారు యూనియన్లలో చేరినయెడల వారిభర్తలు వారిని క్రూరంగా హింసించుతారు. ......అలాగే ఆడబిడ్డలు, బావలు, మఱదులుగూడ దండించుతారు......వారి అజ్ఞానం, నిరక్షరాస్యత కారణంగాగూడ వారు వెనుకబడియున్నవారు. నేషనలిస్టుసైన్యాలు వారు సంఘటితంగావడం నేర్పేటంతవరకు స్త్రీలకు విమోచనమే లేదు."

అంతర్జాతీయ యుద్ధవ్యతిరేక దినోత్సవంలో మదాంసన్ యిలా టెలిగ్రాం పంపింది, "...... అభివృద్ధి నిరోధక నాంకింగు ప్రభుత్వం చైనా జనసామాన్యంపై నిర్బంధవిధానంలో సామ్రాజ్య వాదులతో తూగుతున్నారు. విప్లవ ప్రతీఘాతక కొమింటాంగు నాయకుల ద్రోహబుద్ధి ప్రపంచానికి నేడు ప్రకటితమైనట్లుగా ఎన్నడూకాలేదు. జాతీయవిప్లవానికి విద్రోహం తలపెట్టి, సామ్రాజ్యవాద బంట్లుగా పతనం చెందారు.

పైగా రష్యాతో యుద్ధాన్ని ఉసికొల్పుతున్నారు. కాని చైనా ప్రజలుమాత్రం నిర్బంధాన్నెదిరించి, అబద్ధపు ప్రచారాన్ని మోసపోకుండానే విప్లవం పక్షాన్నే పోరాడి తీరుతారు..."

కొమింటాంగ్ చైనాలో కార్మిక కర్షక స్త్రీలు 1927 కు పూర్వం అనుభవించిన పరిస్థితిలోనే యింకా వున్నారు, బాల్యపు వెట్టిచాకిరీ, పడుపువృత్తి పూర్వంకంటె గూడ మితి మీరిపోయాయి. ప్రజాప్రభుత్వాలన్నీ పడుపువృత్తిని నిర్మూలించుటకు కృషిచేస్తాయి; ప్రప్రథమంగా నిర్వహించవలసిన వాటిలో యిదొకటి. సోవియట్ యూనియన్, సోవియట్ చైనాలలో మాత్రమే యుగయుగాల యీకుళ్లు నిర్మూలించ బడింది. స్పెయిన్‌లో ప్రజాస్వామిక విప్లవం నెలకొన్న ఆరు నెలల్లోనే బార్సిలోనా పట్టణంలో పడుపువృత్తిని నిరసిస్తూ, అదిస్వేచ్ఛా సమాజంలో సహింపరానిదిగా పోస్టర్లు అంటించ బడ్డాయి.

ఈ స్త్రీలతోబాటు కొమింటాంగు ప్రాంతాల్లో మరో వర్గపుస్త్రీలుకూడ వున్నారు. వారు, కార్మిక కర్షక స్త్రీల జీవితాలకు అతీతమైన బూర్జువా స్త్రీలు. వారికివిద్య, అవకాశాలు వున్నాయి. వివాహబంధనాలు, సాంఘిక ఆచారాలు వారిపై నిర్బంధం కాకపోయినా విచ్చలవిడిగా విహరిస్తారు. వారిలో అందరూ అభివృద్ధి నిరోధకులుగారు. వారిలో చాలమంది యదార్థంగా దేశ క్షేమాన్ని అభిలషించిన వారున్నారు. సంస్కృతిగలిగిన మానవమాత్రులుగా వారి మార్గాన వారు దేశానికి సేవచేశారు. చైనా స్త్రీలు సాధారణంగా సౌందర్య

వంతులు. పొడగరులు. అందమైన హస్తాలు, పాదాలు, మృదుల మైన శరీరం గలిగి యుంటారు.

"తుపానులో ఒక పత్రం" అనే అనా యుటాంగ్ పుస్తకంలో కథానాయిక అయిన "టానీ" చరిత్ర లంగరు లేనటువంటి, సంరక్షించే కుటుంబం లేనటువంటి ఒక బూర్జువా యువతి యదార్ధ చిత్రిణమును వివరించుతుంది. ఆమె తనను గూర్చియిలా అంటుంది. "నాజీవితమంతా యిలాగే గడిచింది. ఒక చిక్కు తరువాత మరో చిక్కు సంభవించింది......"

వాస్తవంగానే ఆమె "తుఫానులో ఒక ఆకు." ఆమె జీవితం పరిస్థితుల కారణంగా అసాధారణ జీవితాన్ని గడపవలసి వచ్చే మధ్యతరగతి యువతి జీవితాన్ని పోలినట్టిది. స్వైతన్యంతో విప్లవంకొరకు పోరాడిన మీపింగ్‌యింగ్ జీవితంతో ఆమె జీవితాన్ని పోల్చండి, ఆమెకు తనమార్గం తెలుసు. ఆమె జీవితం కార్మిక కర్షకులకు చెందినట్టిది. ఆమె తనవర్గాన్ని త్యజించినప్పటికీ ఆమెకు స్థానముంది.

స్వచ్ఛంద బూర్జువా స్త్రీ, సూంగ్ సోదరీమణులలో కడగొట్టు ఆమె అయిన మదాంజంగ్ కై షేక్. ఆమెజీవితం, ఆమె ఆరాధించే ఆదర్శాలు ఆమె సోదర మదాంసన్ యట్ జీవితానికి, ఆమె ఆదర్శాలకు పూర్తిగా భిన్నమైనట్టివి. మదాంజంగ్ మిక్కిలి ఆకర్షవంతమైన సుందరమూర్తి. గాంధీజీ తన చరిత్రాత్మక ఆగస్టు 8, 1942 ఉపన్యాసంలో ఇలా అన్నారు, "మదాంజంగ్ సమ్మోహితమైనట్టిది." ఇంకా హాస్యపూరితంగా యిలా అన్నారు. "నాకు ఆమె యెడ ప్రేమ జనించింది, నాయందు ఆమెకు ప్రేమ కలిగింది......"

మే 10, 1938న మడాంజంగ్ ఏర్పాటుచేసిన కూలింగ్ మహాసభ స్త్రీ సంస్థలిన్నిటి కార్యకలాపాలను సమన్వయ పరిచింది. 40 కి పైగా అట్టి సంస్థలు వుమెన్స్ అడ్వాయిజరీ కమిటీలో చేరాయి. మదాంజంగ్ స్త్రీ ఉద్యమ కార్యకలాపాలతోబాటుగా, ఆమెభర్తకు దుబాసీగా పనిచేస్తుంది. చాలా భూభాగం ప్రయాణంచేస్తూ వుంటుంది. యునైటెడ్ స్టేట్స్ కాంగ్రెసులో ఉపన్యసించుటకు ఆహ్వానింపబడిన తొలి మహిళలలో యీామె ఒకతె.

సూంగ్ సోదరీమణులలో జ్యేష్ఠురాలైన మదాంకుంగ్ చైనాలో ప్రముఖ వాణిజ్య సంస్థలలో సభ్యురాలు. ఆమె స్వయంగా సమర్థ వర్తక శిఖామణి. గాయపడినవారి నిమిత్తం హాస్పటల్సును సంఘటన చేసింది.

కొమింటాంగు చైనాలో వేలాది యువతులు, స్త్రీలు యుద్ధ కాలంలో దేశానికై సేవచేయనర్చారు. ప్రతి రంగంలోనూ అలాగే నిర్వహించారు. కాని యుద్ధం సాగుతున్నకొలది కొమింటాంగు ప్రజాస్వామ్య వ్యతిరేకశక్తులు తలెత్తాయి. 1937లో సాధించిన ఐక్యత క్రమంగా క్షీణిస్తూ "ఫోర్తురూట్ ఆర్మీ సంఘన"తో మృగ్యమైంది. ఫోర్తురూట్ ఆర్మీ కేంద్ర ప్రభుత్వం ఆధ్వర్యాన పోరాడుతున్న రెడార్మీలో ఒక భాగం. జపానీయులను నాంకింగు, షాంఘై, హాంకోల వరుసగా వారు దాడిచేయుటకు ప్లాను వేసికొన్నారు. ఇది మధ్యచైనాకు, యాంగ్సీలోయకు కీలకమైన స్థానం. వారిప్లానును కొనసాగనీయకుండా ఆ ప్రాంతపు కొమింటాంగు జనరల్ వారిని ఉత్తరంగా "మార్చి" చేసి తక్కిన రెడార్మీతో కలుసుకొనవలసి

నదిగా అర్ధరిచ్చాడు. అదేవిధంగా ఫోర్తురూట్ ఆర్మీ నడచుచుండగా ఫోర్తురూట్ ఆర్మీని దాడిచేసి కొంతభాగాన్ని పూర్తిగా నాశనం చేశారు. ఈ ఘటనతో కమ్యూనిస్టులకు కొమింటాంగు మధ్య ఏర్పడిన సంయుక్తసంఘటన తునాతునకలైంది. నిర్బంధం పెచ్చుపెరిగింది. ప్రాథమిక ప్రజాస్వామ్య హక్కులు మృగ్యమైనాయి. స్త్రీల గౌరవ ప్రతిపత్తులుగూడ దెబ్బతిన్నాయి. ప్రస్తుతం ప్రారంభమైన దిగ్బంధనం, బార్డర్ రీజియన్ (కమ్యూనిస్టు ప్రాంతాలుకు వ్యతిరేఖంగా ప్రారంభమైన దిగ్బంధనం (బ్లాకేడ్)నికి పూర్వంవేలాది చైనా యువతులు బార్డర్ రీజియన్ రాజధానీనగరమైన యనాన్‌కు వందలమైళ్లు నడచి వెళ్లారు.

యెనాన్‌కు వెళ్లుటకు వారు అనేక ప్రమాదాలను ఎదుర్కొనవలసి వచ్చింది. ఎందువల్లనంటే, సాధారణప్రజలకు స్వాతంత్ర్యభావాలు ఉండరాదనీ శాసించే యుద్ధప్రభువుల భూభాగాలగుండా వారు ప్రయాణం చేయవలసివచ్చింది. పొరపాటున యీ యుద్ధప్రభువుల చేతిలో పట్టుబడిన పక్షంలో వారిని కాన్సెంట్రేషను క్యాంపులకు పంపేవారు. లేదా హింసించి చంపేవారు. అయినా ఇతరుల్ని యిది భయపెట్టలేకపోయింది. ఇంకా వారు తరలి వస్తూనే ఉన్నారు. స్వాతంత్ర్య "మక్కా" లాగా యెనాన్ను ఆరాధించేవారు. దిగ్బంధనం మాత్రం యీ దేశభక్తియుత తీర్థయాత్రలను నిలిపివేసింది.

దిగ్బంధనం నెలకొల్పినప్పటినుండి రెండుప్రాంతాల మధ్య రవాణాసౌకర్యాలు 'బంద్' అయిపోయినాయి. యెనాన్ నుండి ఏవార్తా బయటికి వచ్చేదికాదు. దిగ్బంధనం సంపూర్ణ

మైనట్టిది. రెండు నిండుసంవత్సరాలు ఇండియన్ డాక్టరు భార్య మిసెస్ బాసు ఆమె భర్తనుండి వార్తలే చేరలేదని చెప్పింది. ఆమె హైట్ రూట్ ఆర్మీతో పనిచేసింది. అతనినుండి ఆమెకు జాబులుగూడ లేకుండా పోయాయి.

ఇటీవలనే వార్తలు బయటికి వస్తున్నాయి. విచారకర మైన వార్త యేమంటే జపానుతో ఢీకొనవలసిన దిట్టమైన అర్థమిలియను కోమింటాంగు సైన్యాలు బార్డరులో కాపలా ఉంచబడ్డాయి. ఈ సైన్యాలకు, కమ్యూనిస్టు సైన్యాలకు అనేక సంఘర్షణలు జరిగినట్లు రిపోర్టులు, అలా రెచ్చగొట్టడంద్వారా చైనాలో అంతర్యుద్ధం నూతనంగా ప్రారంభమౌతుంది. దాని ఫలితాలు చైనాకు, మిగతా ప్రపంచానికి ప్రమాదకరవిష యం. జపానువాళ్లకు వ్యతిరేకంగా సంయుక్తసంఘటన మాత్రమే చైనాకు విముక్తి. ప్రపంచానికి శాంతి చేకూర్చ గలదు.

జాతీయైక్యతలో క్షీణతకు కోమింటాంగు ప్రాంతాల్లో స్త్రీల పరిస్థితి బరోమీటరు లాంటిది. అది స్త్రీలకు ప్రత్యక్షంగా తగులుతుంది. ఫోర్తురూట్ ఆర్మీ సంఘటన తరువాత కష్టపడి పనిచేసిన స్త్రీలు, యుద్ధభయభీతాలను ఎదిరించి నిల బడి బాంబులు మొదలగు యుద్ధపరిస్థితులైన ప్రమాదకర పరి స్థితుల్లోగూడ తమకర్తవ్యాలను విధేయతగా నెరవేర్చిన స్త్రీలు మరల ఆడువారిమే" అనే అభిప్రాయానికి నెట్టబడ్డారు. ఒకే పనిలో స్త్రీపురుషుల విభేధాన్ని చూపుతూ అనేక క్రొత్త నియమాలు ప్రవేశపెట్టబడ్డాయి. పోస్టల్ సర్వీసులో వివాహిత

స్త్రీఉద్యోగులు తొలగించబడ్డారు. పల్లె ప్రాంతాల్లో స్త్రీలకు విద్యాసంస్థలు మూసివేయబడ్డాయి.

వుమెన్స్ అడ్వైయిజర్ కమిటీ అన్నిసంస్థల సమావేశం చుంకింగులో ఈహుందా భద్రత, అవమానములకు నిరసనగా ఏర్పాటుచేసినప్పుడు ప్రతినిధులను శక్తిసామర్థ్యాలు, పునాదిపై సెలెక్టుచేశారనే నెపంతో అరోపించబడ్డారు. మదాం జంగు ఈ సమావేశానికి అధ్యక్షత వహించినదనే విషయంగూడ ఈ విమర్శనుండి తప్పించుకొనజాలక పోయింది. ఈ గ్రూపు కార్య కలాపాలు రహస్యపోలీసు, మిలీసుగెస్టాపో కళ్లబడ్డాయి. ఈ అభివృద్ధినిరోధక చర్యలలో అనేక మంది స్త్రీలు అరెస్టు చేయబడ్డారు. అగ్రగామి స్త్రీలందరూ, అడ్వైయిజర్ కమిటిలో ఉన్న కొంతమంది స్త్రీలుగూడ దేశాన్ని విడిచి పోవలసివచ్చింది.

1941లో కొమింటాంగ్ యొక్క సెంట్రల్ ఆర్గనైజేషను డిపార్టమెంటు వారు ఏర్పాటుచేసిన కార్మిక స్త్రీల మహాసభకు స్త్రీలకు రాజకీయాలతో ఎట్టి ప్రమేయం లేదనీ, విద్య, గృహసమస్యలు, సాధారణసేవ మొదలగువాటికే పరిమితం అయివుండాలని గవర్నమెంటు సందేశం. "స్త్రీలు పరిజ్ఞానం, శారీరక దార్ఢ్యం, స్వభావం, టెక్నికల్ సమర్థలలో పురుషులతో సమానస్థాయి నందుకున్ననాడే స్త్రీల ఉద్యమం విజయవంత మౌతుంది." అలాంటి స్టేటుమెంట్ల వెనుకనున్న గూఢార్థం జగద్విదితమే. పురుషులకంటె స్త్రీలు తక్కువ. అందువల్ల వారికి పురుషులనువలె దేశ రాజకీయాల్లో పాల్గొనే తగు పరిజ్ఞానం లేదు. కాబట్టి స్త్రీలకు హక్కులంటూ వుండరాదు. వారికి బాధ్యతలుమాత్రమే!

కోమింటాంగ్ పరిపాలనలో స్త్రీలపరిస్థితి అది. అయినా ఉన్నత, మధ్యతరగతివర్గాల స్త్రీలకుమాత్రం విద్యనభ్యసించి బాగుగా అభివృద్ధి అయ్యే అవకాశాలున్నాయి. ఇక మిగతా వారికి, పేదలు, నిరాహారులైన అధికసంఖ్యాక స్త్రీలకు, భూస్వామ్య పద్ధతులలోనే అణగారుతున్న స్త్రీలకువిశ్రాంతిలేదు, గౌరవప్రతిపత్తిలేదు. ఆత్మగౌరవం అంతకన్నాలేదు. వారికి జీవితమే దుర్భరం. బాల్య వెట్టిచాకిరీ, పడుపువృత్తి, అజ్ఞానం, అంధకారం, ఇదీ వారి గతం. వర్తమాన పరిస్థితిగూడ అదే. కాని ఇది మాత్రం భవిష్యత్తు గాబోదు.

---

# సోవియట్ చైనాలో స్త్రీలు



"గొప్ప నదీప్రవాహంవలె ప్రవహించుము. ముందుకు పురోగమించడ మొక్కటే నీ అంతిమ గమ్యాన్ని చేరుకునేందుకు ఏకైకమార్గం. ఎటువంటి కష్టాల నెదుర్కొన వలసివచ్చినా, ప్రమాదభరిత మేరుపర్వతాలను, ఇసుక తిప్పలను ఢీకొనవలసివచ్చినా సరకుచేయకు. నీకు కనిపించే ప్రతివస్తువుకు నూతన జీవితాన్ని సృష్టిస్తావు."

పీపింగ్ యింగ్

సోవియట్ చైనాలో స్త్రీలనుగూర్చి ఎడ్గార్ స్నో సరిక్రొత్త వివరములను మన ముందుంచింది. వివాహచట్టాలు సమాజంలో స్త్రీగూడ పురుషునితో సమానురాలని గుర్తిస్తూ దాని కనుగుణంగా పూర్తిగా మార్చబడ్డాయి. పడుపువృత్తి రద్దుచేయబడింది. పిల్లలను బానిసలుగా అమ్మడంగాని, స్త్రీలను భార్యలుగా లేక ఉంపుడుగత్తెలుగా అమ్మడంగాని నిషేధించబడింది. ఉభయుల సమ్మతి లేనిదే వివాహాలు జరుగనేరవు. కట్నాలడగడం గొప్పనేరం. భార్య కలిసిఉండగా పురుషులు పునర్వివాహం జరుపుకొనవీలులేదు. స్త్రీలు తమ పాదాలను బంధించరాదు. అలాచేసినయెడల అదిగూడ నేరం

గానే పరిగణించబడుతుంది. శిశుహత్యా, భ్రూణహత్యలను జరిపే స్త్రీలయెడ సోవియట్ చైనా పరుషంగా వుంటుంది. అలాంటి అసహజ కార్యాలకు దోహదమిచ్చే పరిస్థితులు యిక ఆ ప్రాంతంలో లేనేలేవు.

అత్యాశ్చర్యకరమైన, వింతైన విషయ మేమంటే నూతన చట్టాల్లో అత్తల పెత్తనం, అధార్టీని గురించిగూడ చట్టంచేర్చబడింది. విడాకులు వారసత్వచట్టాలుగూడ సవరించ బడ్డాయి. వివాహం ఒండొరుల సమ్మతిమీదనే అంగీకరించ బడుతుంది. స్త్రీలు 18 సం॥లు, పురుషులు 20 సం॥లకు లోపు వివాహం చేసికోరాదని ఆజ్ఞ. వివాహాలు మ్యునిసిపల్ ఆఫీసులోగాని, గ్రామ, జిల్లా సోవియట్‌లోగాని ఉచితంగానే రిజిష్టరు చేయబడతాయి. విడాకులు ఎలాంటి చటప్రతిబంధకాలు లేకుండానే దంపతులలో ఏ ఒకరి కోరికపైనైనా మంజూరు చేయబడతాయి. స్త్రీ పురుషులు వివాహం చేసికోకుండానే దాంపత్య జీవనం గడుపుతున్నయెడల వారు వివాహితులుగానే పరిగణించబడి వారిబిడ్డలుకూడ ఔరసులుగానే గుర్తించబడుతారు. సోవియట్ చైనాలో అనౌరస పుత్రులంటూలేరు. స్త్రీ పురుషులందరికీ ఆస్థి సమంగా పంచబడుతుంది. బిడ్డల పోషణ ఖర్చులు తల్లిదండ్రులిద్దరూ భరించవలసివుంటుంది. మగ పిల్లలకు వలెనే బాలికలకుకూడ విద్య ఉచితమే,

ఈ ప్రాంతపు స్త్రీలనుగూర్చి ఒక కొమింటాంగు సైనికుడు ఎలా అభిప్రాయపడ్డాడో యాగ్నిస్ స్మెడ్లె వివరిస్తుంది. ఈ ప్రాంతాల్లోని స్త్రీలందరూ పెండ్లికిముందే ప్రేమించాలంటూ

రని అతడు గోణిగాడు ! సైనికులు వారిని బలవంతపర్చే విష యంలో వారి వీపున చాకు దిగబడిందన్నమాటే !

మరో పరిశీలకుడు, ప్రేమవివాహాల్లో చాలకొలది విడాకులు మాత్రమే సంభవించాయనీ, అసౌఖ్య దాంపత్యాలు ఎక్కువగా లేవనీ చెప్పాడు. సోవియట్ ప్రాంతాల్లో పని చేసిన డాక్టరుబాను, స్త్రీ పురుషుల మధ్య అలాంటి గొప్పవాతా వరణం తానెక్కడా చూడలేదని చెప్పాడు. వారిలో సన్నిహిత సోదరభావం ప్రదీపిస్తుంది. అలాంటిభావం పెట్టుబడీదారీ ఆధి పత్యంలో అసంభవం ! స్వేచ్ఛ సమాజంలో నివసించే స్త్రీపురు షులకు మాత్రమే మానవసంబంధాల్లో ఆత్మగౌరవం, పరవు లను నొప్పించడం సాధ్యమౌతుంది.

ఈ చైనాప్రాంతంలో స్త్రీలు స్త్రీలుసాధించిన కార్య క్రమాన్నిగూర్చి మదాం సన్ యట్ సేన్ యిలా వ్రాసింది. "పశ్చిమోత్తరాన, జపాను శ్రేణుల వెనుక గెరిల్లా స్థావరాల లోను స్త్రీల కార్యక్రమం నొక్కిచెప్పవలసి వుంటుంది. ఎందు వల్లనంటే అడ్వాయిజరీకమిటీ ప్రధానమైన సహాయకర సర్వీసు నెరపినప్పటికీ బార్డర్ యేరియాలో మాత్రమే (సోవియట్) 1925-27 నాటి సాంప్రదాయాలను అమలు జరుపుతూ స్త్రీల ఉద్యమం, యదార్థ స్త్రీ ఉద్యమం సంఘటితమైంది. ఇక్కడ సంస్థల్లో సంఘటితమైన స్త్రీల సంఖ్య వేలల్లోగాదు, లక్షల లోనే వుంటుంది. వారి కార్యకలాపాలు సాధారణ సహాయ కార్యక్రమమేకాకుండా యుద్ధంలో పూర్తిగా పాల్గొన్నారు. రాజకీయాల్లోను, ఆర్థిక స్వయం పరిపాలనలోను పాత్ర వహించారు.........."

"పెర్సీ, పార్సీ రాజ్యాలల్లో (నార్తువెస్టు సోవియట్ యేరియాలు) అధికసంఖ్యాక స్త్రీలు ఇంకాపాదాలను బంధించే వుండేవారు. నిరక్షరాస్యత 95%కు మించియుండేది. దుర్మార్గులైన గయ్యాళి భర్తలు తమ భార్యలను నానా విధాల హింస పెట్టి బ్రతకడమే ఒక గండంగా నిస్సహాయంగా చేయడం యింకావుంది. ఆడపిల్లలను బానిసలుగా అమ్మనైనా అమ్మే వారు, లేదా చంపేసేవారు. యూనిఫారందుస్తులు ధరించిన ఆర్గనైజర్లను చూడగానే, ఈ వింతైన "స్వేచ్ఛావిహార" స్త్రీ సైనికుల్ని చూడగానే ఇండ్లలోనున్న గృహిణులు భయ పడేవారు.

"వారికి జాగ్రత్తగా బోధించవలసివుంది. ప్రథమంగా బిడ్డలపోషణ, పరిశుభ్రత, మొదలగు విషయాలపై వారితో మాట్లాడాలి. అలాంటి గృహకార్యాలు నెరవేర్చుటలో సల హాలు, సూచనలు తెలియజెప్పాలి, వారి దుర్భర జీవితాలను గూర్చి చెప్పుకునేటందుకు ప్రోత్సాహ మివ్వాలి. పురుషులతో పోల్చిచూపి వారిహక్కుల అవసరాన్ని గుర్తింపజేయాలి. స్త్రీల ప్రాధాన్యతను, వారియోగ్యతలను వివరించి చెప్పాలి— తరు వాత క్రమంగా వారికుటుంబాలతో పోరాటంలో సహాయపు పడాలి. కొన్నిగంటలకాలం వారికి విద్యగరపుటకు, సమావే శాలకు హాజరగుటకు వినియోగించాలి. ఆతరువాత వారికి బాధ్యతలు వప్పగించాలి. ఇంత కష్టతరమైన శ్రమకు ఫలితం ? నేను, బార్డరు యేరియాలో స్త్రీలు వాస్తవిక ప్రజలుగా సైనికయోధులుగా తయారైనారు. పురుషులతో సమానంగా అభివృద్ధి అగుటయేగాదు, వారిని మించిన ఘటన లున్నాయి.

ప్రజాస్వామిక స్వపరిపాలన స్త్రీలకుకూడ పరిపాలక కమిటీల్లో స్థానం కలుగచేసింది.

తోటిగ్రామస్థులైన స్త్రీపురుషులందరూ స్త్రీ అభ్యర్థులను పరిపాలకసంస్థలలోనికి ఎన్నుకొని పంపారు. నేడు అక్కడ స్త్రీ జిల్లామెజస్ట్రేట్లు, పట్టణమేయర్లు, గ్రామనాయకులుగా వుండటం అసాధారణంగాదు. ఉత్తర షాన్సీలోనే స్థానిక స్వపరిపాలన సంస్థల్లో 2000 మంది వున్నారు. స్త్రీ సంస్థలు పాడిపశువుల పెంపకం, యూనిఫారంలను తయారుచేయుట, బిడ్డల సంరక్షణ, గాయపడిన సైనికులకు శుశ్రూష, సైనిక కుటుంబాలకు సహాయం, ప్రయాణీకుల సౌకర్యాలు, పురుషులు యుద్ధరంగానికి వెళ్లినపుడు గ్రామాల్లో వ్యవసాయబాధ్యతగూడ నెరవేర్చుతాయి. చాలా సందర్భాలలో వారు ద్రోహులను పట్టియిచ్చారు. శత్రువు గుట్టుమట్లను సేకరించారు. మిలిటరీ ప్రాధాన్యతగల పనులను, రోడ్లను కాపలా కాయుట వగైరా పనులనుగూడ నిర్వహించారు. ఈ యేరియాలనుండి వచ్చిన వారెవరైనా జీవితంలోని ప్రతి రంగంలోను స్త్రీలు నిర్వహించినపాత్రను, యుద్ధ భీకరాల నడుమ అంధకారమయమైన భూస్వామ్య విధానపు గతజీవితం నుండి నేటి పరిస్థితికి, మిగిలిన చైనాలో గల తోటి సోదరీమణులకెల్లరకూ భవిష్యత్తులో మాత్రమే పొందదగిన పరిస్థితికి వారు ఎలా రాగలిగారో వర్ణించక మానరు......"టింగులింగ్ యొక్క నార్తువెస్టు వుమెన్స్ బాటిల్ ఫీల్డు సర్వీసు గ్రూపు గొప్ప అందోళనా కార్యక్రమాన్ని వైజ్ఞానిక కార్యక్రమాన్ని అమోఘంగా కొనసాగించింది. పోస్టర్లు తయారు చేశారు.

నాటకాలను రచించి నటించారు. ఉత్పత్తికై ప్రచారం సాగించారు. ప్రతిఘటించు ప్రచారాన్ని జరిపారు. ప్రజలు ఆయా కర్తవ్యాలకై ఉత్తేజిత పరచబడ్డారు. అన్నివిధాల యూనిట్ అంటే ఎలావుండాలో ఆదర్శమైనసంస్థ......"

యెనాన్‌లో అద్భుతమైన స్త్రీల విద్యాసంస్థ యంగు వుమెన్సు యూనివర్సిటీ. ఎడ్గార్ స్నో తన "స్కార్చ్‌డ్ ఎర్త్" Scorched Earth పుస్తకంలో యూనివర్సిటీ జీవితచిత్రణ గావించాడు. ఆ యూనివర్సిటీని ఆయన "వీరయోద్ధల యూనివర్సిటీ" అని పిలిచాడు. దిగ్బంధనం ఎత్తివేయగానే యిక్కడికి వందలాది మైళ్లు కాలిబాటన నడచివచ్చిన యువతులెందరో వున్నారు. ఇక్కడ కార్మిక కర్షకుల కుమార్తెలే అధిక సంఖ్యాకులు. కొద్దిమంది మధ్యతరగతి వారున్నారు. సింగపూరునుండి వచ్చిన ఒక లక్షాధికారి కుమార్తెగూడ వుంది. వారంతా చైనానుండి తలొక మూలనుండి వచ్చారు.

యెనాన్ విద్యాకేంద్రంయొక్క నూతన కోణంలో, ప్రపంచంలోకెల్లా అసమానమైనదని నా అభిప్రాయం. యోద్ధలకళాశాల స్త్రీలయూనివర్సిటీ......ఎక్కడో మారుమూల యీ స్త్రీ యూనివర్సిటీ వుండడమే గొప్పవిషయం. యుద్ధం జరుగుతుండగానే చైనా అన్ని ప్రాంతాలనుండి స్త్రీలు వచ్చిచేరడం అత్యంతాశ్చర్యకరమైన విషయం. అన్నిమూలల నుండి అందరూ ఎలా చేరుకోగలిగారా అని నేను ఆశ్చర్యపడ్డాను. విచారించిన తరువాత వారు ప్రమాదకర గెరిల్లా సాహసకృత్యాలు జరిపి శత్రుశ్రేణుల వెనుకభాగమునుండి వందలమైళ్లు నడచి వచ్చారని తెలిసింది. ఇక్కడే విద్యా

దాహం వాస్తవంగావుంది. ఎంతమంది అమెరికన్ యువతులు యుద్ధ భూభాగాలగుండా 500 మైళ్లు ప్రయాణంచేసి గుహల్లో ఉన్న కాలేజీలో, తనవంతు కూరగాయలను వారే పండించు కొనవలసిన కాలేజీలో చేరుటకు బయలుదేర గలరు?......"

కాలేజి 200 కొండ గుహలలోపల నిర్మించబడింది. ఆటశాలలకు ప్రత్యేకంగా ఒక థియేటరు, ఆటస్థలములు, బాస్కెట్‌బాల్ కోర్టులు, స్వారీచేయుటకు ప్రత్యేకస్థలము డ్రిల్లుస్థలములున్నాయి. విద్యార్థినులందరూ యూనిఫారంలు ధరించి, గుడ్డచెప్పులు ధరించి, సైనికటోపీలను పెట్టుకొం దురు. వారిలో కొందరు వివాహితలు. వారిభర్తలు సైన్యం లోగాని, లేదా ఏదైనా యుద్ధకార్యకలాపాల్లోగాని పని జేస్తారు.

విద్యార్థినులు ప్రాతఃకాలముననే లేచి రెండుగంటల కాలం తమ తమ కూరగాయల తోటలోను, తదితర తోటపనులలోను పనిచేయవలసివుంటుంది. కాలేజి సెక్రెటరీ అయిన కొచిన్ అన్ని రకాలస్త్రీలకు తగువిధముగా పాఠ్యావళిని ఏర్పాటు చేశారని ఎడ్గారుస్నోతో చెప్పింది. నూటాస్ విద్యార్థులలో కొందరు యూనివర్శిటీ విద్యార్థినులున్నారు. తక్కినవారు రైతుస్త్రీలు."

ఇక్కడ మూడు తరగతుల విద్యార్థినులున్నారు. ఆమె వివరించింది. "చాలమంది విద్యార్థినులకు కాలేజిలో చేరినపుడు చదువురానట్టివారు. అటువంటి వారిని, ప్రేమరీస్కూలు విద్య మాత్రమేగల తరితరులను స్పెషల్ క్లాసుగా పరిగణిస్తాం. ఆ క్లాసులో వారికి చైనాభాష, సాంఘిక సమస్యలు, ఆరోగ్య శాస్త్రం, రాజకీయ, మిలిటరీ సాధారణ పరిజ్ఞానం, కమ్యూ

నిష్టుపార్టీ క్లుప్త చరిత్ర బోధించబడతాయి. ఒక సంవత్సరం తరువాత వారిలో కొంతమంది సెకండుక్లాసుకి ప్రమోట్ చేయబడతారు! ఆ తరగతిలో సామాజిక చరిత్ర, రాజకీయ ఆర్థికవిధానం, చైనా కమ్యూనిష్టుపార్టీ సమస్యలు, మూడు సూత్రాలు, మిలిటరీ సమస్యలు, ప్రాథమిక తత్వశాస్త్రం, ప్రజారోగ్య సమస్యలు బోధించబడతాయి.

"తరువాత హయ్యర్ రిసెర్చిక్లాసు యూనివర్సిటీ విద్య నభ్యసించిన వారుగాని, దానికి సమతుల్యమైనదిగాని, లేక స్పెషల్, సెకండరీక్లాసుల్లో తర్ఫీదు పూర్తిచేసినవారుగాని ఈ క్లాసుకు అర్హులు. హయ్యర్ రిసెర్చి విద్యార్థినులకు రాజకీయ ఆర్థికవిధానం, మార్క్సిజం-లెనినిజం, తత్వశాస్త్రం, ప్రపంచ విప్లవ చరిత్ర, ఏదో ఒక విదేశభాష నేర్పబడుతాయి. యుద్ధ కార్యకలాపాల్లో ప్రత్యేక ఉద్యమాల్లో నాయకులుగా తర్ఫీదు చేస్తాం. ఆక్రమిత ప్రాంతాల్లో రాజకీయ విషయ నిర్వాహణకు కొన్ని సంస్థల్లో నాయకులుగా తర్ఫీదుచేస్తాం. విద్యాబోధన, వైద్యసేవ, ప్రచారం, సహకార సంస్థల నిర్మాణం వగైరా గూడ బోధించబడతాయి. ఇంగ్లీషు, రష్యన్, జపానుభాష, సాహిత్యం, సంగీతం, పాట్టుపాండు, జర్నలిజం, నేతపని, వడ కుట మొదలగునవి ఐచ్ఛిక విషయాలుగా బోధించబడతాయి."

కాలేజి పాఠ్యగ్రంథాలు, భోజనం, బస, విద్య అన్నీ ఉచితమే. కాని విద్యార్థినులు వారి వారి యూనిఫారంలను పక్క-దుస్తులను తెచ్చుకోవాలి. అధికతర ఆచరణ రీత్యా బోధింపబడే యీ విద్యావిధానం కొమింటాంగు ప్రాంతాల్లో గాని, క్రిస్టియన్‌స్కూళ్లలోగాని బోధింపబడే విధానానికి

తరతమ వ్యత్యాసముంది. ఇతరస్కూళ్లు వృత్తివిద్యలనుగాని, మిలిటరీ తర్ఫీదును గాని ప్రాధాన్యత నీయవు ఈ వెనుకబడిన ప్రాంతానికి కమ్యూనిష్టులు ప్రవేశించకముందు స్త్రీలుగుర్రాలు గానో, గాడిదలుగానో అద్దెకివ్వబడేవారనీ, పురుషులు మాత్రం యింటివద్దనే కూర్చుని రుసుములు వసూలుచేసేవారనీ స్నో విశదంగా, స్పష్టంగా విదితం చేశాడు. సోవియట్లు విద్యా విధానంలో అనేకమెట్లు అధిగమించారు. అనేక ఆటంకాలను ఎదిరించి గూడ యెనాన్ నేడు దేశంలో ఒక పెద్ద విద్యా కేంద్రమైంది.

డాక్టరుబాసు ఈ యూనివర్సిటీ విద్యార్థులనుగూర్చిన సాంపైనకథలు వివరించారు. కాలేజీని సందర్శించి అనేక మంది విద్యార్థుల్ని కలుసుకున్నానని చెప్పారు. వారిలో కొంతమంది తరువాత ఆయనను కలుసుకొని ఇండియాను గురించి, ప్రత్యేకంగా ఇండియా స్త్రీలను గూర్చి నొక్కి అడిగారు. స్త్రీల యుద్యమంలోగూడ విద్యార్థులకు తర్ఫీదు యివ్వబడుతుంది. తర్ఫీదు అయిన తరువాత వివిధజిల్లాలలో కార్యక్రమం కొనసాగించుటకు నాయకులుగా, ఆర్గనైజర్లుగా పంపించబడతారు. కొంతమంది కొమింటాంగ్ ఆధ్వర్యానవున్న "స్వతంత్ర" చైనా భూభాగంలోకి గూడ పంపించబడ్డారు.

అటువంటి యువతులెందరో అచటి అధికారులచే పట్టుబడి కాన్సంట్రేషన్ క్యాంపులకు పంపించబడ్డారు. లేదా చంపి వేయబడ్డారు. ఒక ప్రఫుల్లమైన ఒక అమ్మాయి, ప్రత్యేకంగా ఆప్తమిత్రురాలైన ఒక అమ్మాయిని తాను ఎన్నటికీ మర్చిపోలేనని ఆయన అన్నారు. ఆమె ప్రత్యేకంగా ఇండి

యానుగూర్చి తెలుసుకునేటందుకై తరచుగా హాస్పిటలుకు వెళ్లుతూండేది. ఆమెను కొమింటాంగు ప్రాంతాలకు పంపగానే అచటి అభివృద్ధి నిరోధకులు పట్టుకొని పరలోకప్రాప్తి కలుగ జేశారు. అలాంటిది యీసాహసిక యువతుల జీవితం.

అదేసమయంలో హాస్పిటలు రోగిగానున్న టింగు అంగు రచయిత, మరో చైనాయువతి. అధికసంఖ్యాక చైనీయులకంటె ఆమెకు పెద్ద నేత్రాలున్నాయి. డాక్టరుబాసు, డాక్టరుకోట్నిస్ ఆమె నొక అద్భుతవ్యక్తిగా పరిగణించారు.

అటువంటి ఉత్తమచైనా యువతులతో మెలగుతూ, డాక్టరు కోట్నిస్ స్వయంగా ఒక చైనాయువతినే పరిణయమాడారంటే ఆశ్చర్యకరమైన విషయం కాదు. ఆమె ఆర్మీలో పనిచేస్తూ వుండేది. చైనా, భారతీయ ప్రజలమధ్య ఎల్లప్పుడూ స్నేహ పూర్వకసంబంధాలే విరాజిల్లుతుంటాయి. పైగా అటువంటి వివాహాలు ఈస్నేహ సద్భావాన్ని ఘనీభవింప జేస్తాయి.

యుద్ధం ముగిశాక స్త్రీల పరిస్థితి, స్థానమేమిటని చాల మంది ప్రశ్నించుతారు. అలాంటి సాహసిక చరిత్ర, పోరాట తత్త్వం కలిగియున్నపుడు సమాజంలో అంత ఘనంగా సాధించిన హోదాను సందేహించడం సాధ్యమా? వారి భవిష్యత్తు ఫాసిస్టు శక్తులన్నిటి పరాజయంతోటీ, బహుకాలంగా స్త్రీలను బానిసలుగా జేసిన హింసాత్మక విధాన పరాజయంతోటి ముడి పెట్టబడి వుంది. మదాం సన్ యిలా అంటుంది, "దురాక్రమణపై విజయం సాధించబడినప్పుడు చైనా స్త్రీలుకూడ, ఫాసిజ కిరాతకత్వంలోను, ప్రపంచమంతటా విస్తరించిన యుద్ధంలోను పురుషులకంటె మిన్నగా హింసించబడిన స్త్రీలతో సమా

నంగా, భవిష్యతులో ఉద్యమ మెల్లా అభ్యుదయమై యుండా లని, నేటి ప్రపంచ భీకర పరీక్షాసమయం ఇదే కడపటిది కావలె నని ఎదురు తెన్నులు చూస్తున్న స్త్రీలతో సమానంగానే తులతూగుతారు......" ———

## తుదిపలుకు

జీవం, తేజం తొణికిసలాడే గంభీరవదనంగల హాహార్ చూయిర్‌ను నేను ప్రథమ పర్యాయంగా ఒక కలకత్తా సిని మాహాలు అర్ధాంధకారంలో గాంచాను. తొలిగా, 1943లో చైనా దినోత్సవంనాడు సమావేశమైన వేలాది చైనా సైనికు లలో యీామెగూడ ఒకతె అనుకున్నా. పసిడివదనాల మహా సాగరంలో తీక్ష్ణమైన ఆమె వదనం గోధుమ క్షేత్రంమధ్య ఒక గసగసాల మొక్కవోలె నాకు తోచింది. మరల ఆమెను చూచాను. అది వక నారీమణి ముఖారవిందమని గ్రహిం చాను. సైన్యానికి చెందిన చైనాయువతులలో నేను తొలి సారిగా చూచిన యువతి యీామెయే. ఆమెతో సంభాషిం చాలని ఉబలాట పడ్డాను. అలాగే చేశానుగూడ. ఆమెకు ఇం గ్లీషురాదు. నాకు చైనాభాష అంతుపట్టదు! అయినప్పటికీ స్నేహితులం కావడానికి అది మమ్మల్ని ఆటంకపర్చలేక పోయింది. మాలో ఎక్కువ ఉద్రేకపూరితులమైనది నేనో, లేక ఆమెయో నాకు బోధపడలేదు. నేను చూచిన ప్రథమ చైనా సైనిక యువతి ఆమె అయితే, ఆమె ఎరిగిన ప్రథమ భారతీయయువతిని నేనే. చైనీస్ కన్సోలేట్ (Chinese Consolate)

కు సంబంధించిన ఒక యువకుని దుబాషీగా వ్యవహరించవలసి నదిగా వేడుకున్నాం. మేం గంటలతరబడి మాట్లాడుతున్న కొలదీ అతన్ని సంతోషపెట్టుటకు ఐస్‌క్రీములు, కేకులతో ముంచెత్తవలసి వచ్చింది. ఆ యువకుని పుణ్యమా అంటూ మేం అనేక పర్యాయములు కలుసుకున్నాం.

హుహోంచూయిం అంటే హాంతెగ చక్రవర్తి. కాని ఆమె సైన్యంలో చేరకముందు చైనాభాషలో తృణగ్రాహి (తృణగ్రాహి అనే ఒకరాయి) కి తుల్యమైనదిగా వుండేది. తన పిల్లచేష్టలనన్నిటినీ జపానువాళ్లను ఓడించేదాక కట్టిపెట్టింది. "విజయం సాధించేవరకు నేను వివాహం చేసుకోను. జపాను వాళ్ల తరహో పూర్తిగా చైనా స్త్రీలు ఎరుగుదురు. వారికి మేం ఎన్నటికీ లొంగిపోం. మాతండ్రి ఒక కాంటన్ వర్తకుడు. నాకు ఒక సవతితల్లి, ఇంకా ఏడుగురు సోదరీసోదరు లున్నారు. యుద్ధం ఆరంభమైనపుడు నాకు 17 సంవత్సరాలు. తక్కిన పిల్లలతో బాటు నన్ను గూడ పల్లెసీమకు పంపేశారు. అక్కడ వక నెలమాత్రం వున్నాను. తరువాత 30 మంది విద్యార్థు లతో సహా కాంటనుకు తిరిగివచ్చి మరల కార్యక్రమం కొన సాగించాను. అక్కడ కార్యక్రమం అనేక రకములుగా వుం డేది. సైన్యానికి వలసిన సామగ్రిని తయారుచేయుటకు స్త్రీ కార్మికుల్ని సంఘటితపరచాం. దానినే వుమెన్స్ ఆగ్జిలరీ అం టారు. వెచ్చని దుస్తులు, ధనము, మందులు ప్రోగుచేశాం. ఇలాంటి కార్యక్రమం ఏడునెలలు కొనసాగించిన తరువాత నేను సైన్యంలో చేరవలెనని నిశ్చయించుకున్నాను. నేను మాతల్లిని పోగొట్టుకున్నాననే దుఃఖోద్వేగంతో మాతండ్రి సేవ

సైన్యంలోచేరుటకు యిష్టపడలేదు. అయినా నేను హాంకోకు వెళ్లిపోయి అక్కడ జనరలిజ్మో జంగ్-కై-షేక్ ఆధ్వర్యాన నడుపబడే స్త్రీల ట్రయినింగుస్కూలులో చేరాను. అక్కడ మేం 10,000 మంది మున్నాం. అక్కడనుండి నేను మాతండ్రి గారికి, "దేశం ప్రమాదంలో వున్నది. ప్రతివక్కరూ తన వంతు సహాయం చేయాలి. నన్నుగూర్చి నీ వేమీ చింతించ వద్దు" అని టెలిగ్రాం యిచ్చాను.

నాకు వారినిగూర్చి అప్పుడప్పుడూ వార్తలు వస్తూవుం టాయి. ఇప్పుడు మాతండ్రికి వ్యాపారంలేదు. జపానువాళ్లు ధ్వంసం చేశారు. ప్రస్తుతం వక వ్యవసాయదారుడై భూమిని సాగుచేస్తున్నాడు. మావదినె జపానువారి తుపాకి గుండ్లకు గాయపడింది.

మాపట్టభద్రత పూర్తికాగానే మమ్మల్ని యుద్ధరం గానికి పంపారు. నేను 152వ డివిజనులో చేరాను. అక్కడ సైనికులకు జాబులు వ్రాసిపెట్టేవాళ్లం, వారికి దేశభక్తియుత గీతాల్ని ర్పేవాళ్లం, చదివి వినిపించేవాళ్లం, శుశ్రూషలో సహాయమొనర్చి, సైనికుల నైతికశక్తిని నిలబెట్టుటలో కృషి చేసేవారం. గాయపడినపుడు వారి హృదయాలకు హాయిని గూర్చే వారం.

1942వ సంవత్సరంలో బర్మాకువెళ్లి 5వ సైన్యంలోకి నన్ను పంపారు. కొంతకాలంపాటు మేం బర్మాసరిహద్దుల్లో వుండి బర్మీయుల్లోను, చైనా నావికుల్లోను ప్రచార కార్యక్రమం కొనసాగించాం. ఇక్కడ మేం యుద్ధరంగానికి చాల దగ్గరలో, శాల్వుల ప్రదేశానికి చేరువలోనే వున్నాం.

బర్మాలోవున్నప్పుడే నాకు భారతీయులతో ప్రిప్రిథమంగా పరిచయం కలిగింది. సాధారణంగా బర్మీయులు మాతో విరోధులుగా వుండేవారు, కాని భారతీయులు మాత్రిం మాకు అన్ని విధాల సహాయం చేశారు.

అక్కడ తరచుగా అరాజకాలు జరుగుతూవుండేవి. బర్మీయులు అప్పుడప్పుడు మాస్టోరులకు నిప్పంటించి మా ఆయుధాలు, పరికరాలు నష్టపర్చవలెనని ప్రియత్నించేవారు. అందువల్ల మాసరకులపై ఖచ్చితమైన నిగా వుండేది. ఒక రోజున నేను కాపలా డ్యూటీలో వుండగా ఒక బర్మీయుడైన 'పోంగే' ని (బుద్ధమత పీఠాధిపతి వేషంలో నున్న బర్మీయుడు) మా సరుకులకు నిప్పంటించబోతుండగా పట్టుకున్నాను. నన్ను స్త్రీ అని గుర్తించగానే అతడు నన్ను భయపెట్ట జూచాడు. నేను వెంటనే నా రివాల్వరు తీసి అతన్ని బందీగా పట్టుకున్నాను.

ఒక పర్యాయం నేను షికారుకువెళ్లి మాక్యాంపును చాలాదూరం వచ్చేశాను. ఒక భారతీయ రిక్షాకూలి నాకు కనబడి, యిలా ఒంటరిగా తిరగవద్దనీ, పంచమాంగ దళం వారు చూచినయెడల నన్ను బాధించెదరనీ చెప్పాడు. మా సైనికులలో చాలమంది యీవిధంగా చంపబడ్డారు. నన్ను తన రిక్షాలో కూర్చొనవలసినదిగా నన్ను బలవంతపర్చి, ఎన్నో మైళ్లదూరానవున్న మాక్యాంపుకు తీసుకు పోయాడు. మరల నేను అతనికి బాడుగ యివ్వబోతే తీసుకొనక తిరస్కరించి యిలా అన్నాడు. "భయపడవద్దు. నేను బర్మీయుడనుగాను, నేను భారతీయుడను. భారతీయులు, చైనీయులూ సహోదరుల వలె స్నేహితులం".

బర్మా పతనమైన తరువాత మేం ఇండియాను తిరోగ మించవలసి వచ్చింది. యదార్థంగా అది మేం యెన్నడూ ఎరు గని ఘోరానుభవం.

నేను బ్రతికియున్నంతవరకూ ఆ అనుభవాన్ని మరువ లేను. మూడునెలలు మేం సగటున రోజుకు 20 మైళ్ళచొప్పున, ఎక్కువగా 25, 30 మైళ్ళ చొప్పున నడిచాం.

మొదట మేం మా ఆహారాన్ని మోసుకొని పోయాం. ఆ తరువాత అది సమాప్తి చెందగానే గుర్రాల్ని, కంచరగాడి దల్ని చంపి తినేవారం. కొండల మార్గాన మేం ప్రయాణం చేయుడంమూలంగా మాకు సహాయంచేసినవారే లేక పోయారు. తరచుగా మా అంతట మేం నిర్మించుకున్న రోడ్లపై నడిచి వెళ్లేవారం. వర్షాకాలంలో మాపని మరీ ఘోరమైంది. వక అడుగు ముందుకువేస్తే రెండడుగులు వెనక్కు జారేది. ఆ తడి ముద్దారిన బట్టలతోనే రాత్రిఅంతా కూర్చుని సపో ర్టుగా వకరి కొకరు ఆనుకొని నిద్రపోయేవాళ్లం. వేలాదిమంది జలగకాట్లుకు, కలరా, టైఫాయిడ్‌లకు ఆహుతి అయ్యారు.

రాత్రింబగళ్లు ఎడతెగకుండా వర్షంకురిసేది. వక పర్యా యం వక అంధకారడవిగుండా ఐదురోజులు ఆకాశం అగుపించ కుండానే నడిచాం. రోజుల తరబడిగా మాకు ఆహారం లభిం చేదికాదు. మేం ఎంత బలహీనులమయ్యామంటే మాకామ్రేడ్స్‌లో చాలమంది కొండకు ఎక్కుతుండగా వకసారి ఎగ శ్వాసపీల్చి, కొద్దిగాతూలి చనిపోయేవారు.

నేను ఎలా బ్రతికానో నాకే తెలియదు. మొదట ఉన్న మేం పదముగ్గురం యువతులకూ ఆయాలే కడపటికి ఆరుగురు

మాత్రమే మిగిలాం. ఒకసారి నాకు కలరా పట్టుకుంది. డాక్టరుయిచ్చిన ఇంజక్షనుతోటి, బర్మాలో నివసించే ఒక చైనీయుని వైద్యంతోటి నేను గడిచి గట్టెక్కాను"...... ఆమె మాట్లాడుతున్నంతసేపూ నేను తన్మయతతో ఆకర్షక మైన ఆమె ముఖారవిందమును వీక్షించుతూ కూర్చుండి పోయాను. చనిపోయిన తనతోటి కామ్రేడ్సను తలచినపుడల్లా ఆమెనేత్రాలు జలపూరితాలయ్యేవి. ఆమె తన కాళ్లమీది పుళ్లు, గాట్లు, కాట్లు చూపుటకై తన యూనిఫారంను పైకితీసి చూపించిం. దుస్సాధ్యమైన అరణ్యాలమధ్య వేలావెమైళ్లు ఆమెను గొనివచ్చిన ఉక్కుకాళు అవి!

"ఆ మోకాటిలోతు బురద, రోడ్లను పవిత్రంచేసే ఆ మృత కళేబరాలు, దుస్సహమైన ఆ అలసట నాకు గుర్తు కొస్తే నేనెందుకు మరణించలేదా అనిపించేది. కాని అలాంటి సమయాల్లో నాదేశం, నాదేశపు చెరలు, మేం చైనాను వీడక ముందు జనరలిజ్మో మాకు అంపిన సందేశం అవన్నీ జ్ఞప్తికి వచ్చేవి. ఆయన చెప్పారు. "కష్టం సంభవించినప్పుడల్లా చైనా, చైనా విజయాన్ని సంస్మరించండి. ఎంత దుర్భరమైనా సరే, ముందుకేసాగి పదండి." ఆ ఆదేశమే నాకు శక్తినీ బలాన్ని యిచ్చి ఆనంద పరవశత ఒనగూర్చేది.

అదంతా సహించిన తరువాత ఇక్కడ ఇండియాలో మాకు స్వర్గంగా కనిపిస్తోంది. మాసైన్యాలు భారతీయుల్ని ప్రేమిస్తాయి. అందువల్ల యిక్కడ మాకు ఎంతో సంతోషంగా గడిచిపోతోంది. భాష భేదం కారణంగా ప్రజలతో మేం మాట్లాడలేకపోతున్నందుకు మేం ఎంతో విచారిస్తున్నాం.

భారతీయులుగూడ మమ్మల్ని ఆదరిస్తారు. మన మిరువురమూ ఒకరి కొకరు మిత్రులంగా పరిగణించుకొంటాం. ఇండియా, చైనాలు ఒక్కటిగా మైత్రికలిగి యుండాలి. చైనా పోరాటాన్ని ఇండియా అర్థంచేసికొని జపానును ప్రతిఘటించుటలో సహాయపడతారని ఆశిస్తున్నాం. జపాను అంటే యేమిటో వారికిగూడ బాగుగా తెలుసు. ఎందువల్లనంటే, చైనానుమాత్రమే అణచవలెననిన దే జపాను దురాశగాక ఆసియాపైననే ఆధిపత్యం వహించవలెనని జపాను దురభిప్రాయం. దీని అర్థం స్త్రీలు గమనించనియెడల ప్రమాదకరం. చైనా స్త్రీలందరికీ ఇది విదితమే. జపాను పుట్టుపూర్వోత్తరాలు వారికి బాగా పరిచయమే."

వీడ్కోలు చెప్పగానే మానేత్రాలు చెమ్మగిల్లాయి. దుఃఖభారంతో ఒకరిపై ఒకరు వ్రాలాం. ఆమె నాకు కేవలం హుూహూణ చూయిణ మాత్రంగానే గాదు, తమ జీవితాల్ని సౌఖ్యప్రదం చేసికొనుటకు పోరాడుతూ, తద్వారా స్త్రీజాతికే మేలు చేకూరుస్తున్న చైనా ధీరయువతుల మూర్తిగా నాకు తోచింది. నన్ను ఆమె ఎలా పరిగణించిందో నాకు తెలియదుగాని ఆమెనేత్రాలనుండి బాష్పబిందువులు రాలగానే వచ్చీరాని ఇంగ్లీషులో యిలా అన్నది.

"నాకు యింగ్లీషు తెలుసు, నేను నీకు జాబులు వ్రాస్తూండగలను." ఆవాక్యం ఎంత మధురంగా వున్నదంటే నేను మాట మాట్లాడలేక పోయాను. మాకన్నీరు చిరునగవు తొణికించగా ఆమె చేయి ఆమె టోపీశిఖరానికి శాల్యూట్ కొరకై పైకిలేచింది. సమాప్తము.

---



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA108B163 |
| పుస్తకం పేరు | చైనా కథలు |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 137 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |